# ప్రజల కోసం పాత్రికేయం

## ప్రమాణాలు - ప్రభావాలు

### (వ్యాస సంకలనం)




**కీ.శే. మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మృతిగా....**

**సంకలనం & సంపాదకత్వం గౌరప్**

## గణేష్ శంకర్ విద్యార్థి మహత్తర “ప్రతాప్” పత్రికకి

## 110 సంవత్సరాలు...

ప్రచురణ: మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మారక వేదిక, పిఠాపురం

తేది: 2022, డిసెంబర్,04 (మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) జయంతి సందర్భంగా....)

టైపింగ్: లెనిన్ బాబు పెద్దింశెట్టి, అంగర.

## అంకితం



**శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారు**

మహా స్వాతంత్ర్య సమరయోధుడు, తిరుగులేని తిరుగుబాటుదారు, రాజీ ఎరుగని రాజకీయ నాయకుడు, సామ్యవాద యోధుడు, కాంగ్రెస్, నవశక్తి, జయభారత్, వెలుగువంటి సంచలన పత్రికాధినేత, ప్రజాపక్ష పాత్రికేయుడు, ఎంతో మంది ఆలోచనాపరులకి గురుతుల్యుడు, జీవితాంతం దేశం కోసమే త్యాగం చేసిన మహా త్యాగి **శ్రీమద్దూరి అన్నపూర్ణయ్య** గారి దివ్యస్మృతికి, భిన్నాభిప్రాయాలను గౌరవిస్తూనే ఈ అక్షర కృతినిలా నివేదించుకుంటూ...

# విషయసూచిక

# 01. ప్రచురణ కర్తల మాట....

"అన్ని ఉద్యమములకు విలేఖరులు ప్రాణము వంటివారు !"

"ఏ దేశమునకైనను, ఉద్యమముకైనను ప్రాణములు లేఖకులే. వారి వ్రాతలను చదివియే వక్తలు ఉపన్యసించు చుందురు. వారి గ్రంథములను పఠించియే యువకులు, బాలురు విద్యావంతు లగుచుందురు. వారి బోధల నాలకించియే సంఘములు సంస్కరింప బడుచుండును. లేఖకుల తోడ్పాటు లేనిదే ప్రపంచములోనే యుద్యమమును ఇంతవరకు విజృంభించలేదు. ఇక ముందు విజృంభించబోదు.."

85 ఏళ్ళ క్రితం కేశవరంలో జరిగిన ప్రోగ్రసివ్ రైటర్ల మహాసభలో ఆంధ్ర రచయితల సభాధ్యక్షులు గా గరిమెళ్ళ సత్యనారాయణ గారు ప్రసంగం చేస్తూ చెప్పిన గొప్ప మాటలివి. ఆ ఉపన్యాసం ప్రారంభంలోనే ఆయన "లేఖకునికి కలిగే రెండు శక్తులు ప్రోద్బలము చేయుచుండుట వలననే వారు లేఖమునకు గడంగుదురు. వీనిలో మొదటిది ఆత్మతృప్తి. రెండవది పాఠకుల నుత్తేజింప జేయవలెనను ఆసక్తి. ఈ రెండు సంకల్పములలో నేదియు లేని వ్రాతలు వ్రాతలే కావు. అవి కేవలము అక్షరముల ప్రోవులు." అంటారు.

అలా ఒకనాడు సమాజాన్ని పురోగతి వైపుకు చైతన్య వంతం చేసిన ప్రజా పాత్రికేయం ఈ రోజు ఏ స్థితిగతుల్లో ఉందనే ప్రశ్న ఈ సంకలనానికి ప్రధానమైన ప్రేరణ. అందరికీ బాంబు గా సుపరిచితమైన మేకా సత్యనారాయణ శాస్త్రి జీవితాంతం ఫ్రీలాన్స్ జర్నలిస్టుగానే బతికారు. నిబద్ధత కలిగిన కార్యాచరణే నిజమైన పాత్రికేయుడి కర్తవ్యంగా భావించారు. చివరికి తనకీ, తన

కుటుంబానికి సెంటు భూమి కూడా లేకుండా నిజాయితీకి ప్రతిరూపంలాగే చనిపోయారు.

ఎన్ కౌంటర్ పత్రికని దశరధరామ్ తో కలిసి స్థాపించిన ఆయన తదనంతరం దశరధరామ్ తో విభేదించీ ఏకంగా "ఎన్ కౌంటర్ దశరధరామ్ బండారం" అనే పుస్తకం రాసారు. తర్వాత దశరధరామ్ తో స్నేహాన్ని కొనసాగించారు. కానీ కొద్ది రోజులకే దశరధరామ్ హత్య జరగడంతో మనస్తాపం చెంది క్రియాశీలకంగా ఏ పత్రిక లోనూ లేకున్నా జీవితాంతం తాను నమ్మిన దానినే అనుసరించి, ఆచరించారు. అనేక మంది యువతకి నిఖార్సైన పాత్రికేయ గురువుగా భాసించారు.

చనిపోయేనాటికి ఉభయ తెలుగు రాష్ట్రల్లో సుమారు ఐదారు పత్రికలకు సలహా దారుగా ఉన్నారు. అక్షరాల్ని నమ్ముకున్నన్నాళ్ళు ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా అక్షరాల్ని అమ్ముకోవడానికి సిద్ధపడకపోవడం వలన జర్నలిస్టు గా అరుదైన రికార్డు స్థాయిలో అనుభవాలు, నైపుణ్యం ఉండి కూడా ఎవరి దగ్గరా నోరు విప్పి తన అవసరాన్ని చెప్పలేక పోయారు. చివరి వరకూ ఆర్ధికంగా నిలదొక్కుకోకున్నా ఆత్మాభిమానాన్ని తాకట్టు పెట్టలేక అలాగే మిగిలి పోయారు.

ఆయన అండని చూసుకుని ఒకనాడు ముందుకు పోయి నిలదొక్కుకున్న వాళ్ళే ఆయన మీద అక్రమ ఆరోపణలు చేసారు. అవాస్తవాల్ని ప్రచారం చేసారు. ఆఖరికి ఆయన నిరాడంబర మరణం వాళ్ళందరికీ చెప్పకనే జవాబు చెప్పింది. సూర్యుడి మీద ఉమ్మేస్తే ఎవరి మొహాన పడుతుందో ఈనాటి వాళ్ళ జీవితాలే పెద్ద ఉదాహరణ. ఎవరౌనన్నా కాదన్నా జర్నలిస్టుగా బాంబు

స్థాయి శిఖరాయమానం. Habitual Earningకి నేను వ్యతిరేకం అంటూ చెప్పుకున్న ఆయనకు ఆయన మాత్రమే సాటి.

ఆ మేటితనం ధీటైన నిజాయితీ కే ఉంటుంది. అదెలా ఉంటుందో అసలాయన జర్నలిస్ట్ కాదని అభాండాలు వేసిన బడుద్దాయిలకు ఎప్పటికీ తెలిసే అవకాశమే లేదు. ఎందుకంటే ఆయన జీవితాంతం స్థాపించినవి, సలహాదారుగా ఉన్నవి, పని చేసిన ప్రధాన పత్రికలు, వార్తా సంస్థల పేర్లు సేకరిస్తే అదే ఒక పేద్ద గ్రంథం అవుతుంది. ఇక చిన్నా చితకా వాటికైతే లెక్కేలేదు. ఒక్క తెలుగు లోనే కాదు, ఇంగ్లీషు లోనూ, హిందీ పత్రికల్లో కూడా ఆయన సలహాదారుగా ఉన్నారు. ఐనా ఆధారరహిత ఆరోపణలకు అసూయ, అహంభావాలే చాలు. అతిశయోక్తి అనిపించవచ్చు కానీ , ఆయన జ్ఞానం ముందు నిలవగల ధనమూ, ధైర్యమూ ఇంకా పుట్టలేదు.

మేకా సత్యనారాయణ శాస్త్రి @ బాంబు మొదటి వర్ధంతి సందర్భంగా తీసుకువస్తున్న ఈ పుస్తకం అత్యంత పరిమితమైన ప్రయత్నం. ఒక మంచి వ్యవస్థ దిశగా అడుగులు వేస్తూన్న కలాలకి దిక్సూచిగా ఒక సంకేతం. అందులో భాగంగా ఈ అక్షరాలు చదివిన గుప్పెడు మంది కొత్త తరం యువజనులు ప్రజల కోసం పాత్రికేయ జీవితంలోకి ప్రవేశించడానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చేందుకు నిర్ణయం తీసుకున్నా మా ఈ చిన్న కృషికి అపారమైన సార్ధకత చేకూరినట్లే భావిస్తాము. ఎందుకనేది స్పష్టమే, జ్ఞానాన్ని ఎదురుకునే ధనమూ, ధైర్యమూ ఇంకా పుట్టలేదు, బహుశా ఎప్పటికీ పుట్టలేవు..... సెలవు.

**---- ప్రచురణకర్తలు**

# 02. ప్రత్యామ్నాయ పత్రికల అవసరం - 'ముందడుగు' అనుభవాలు

- ఐకా బాలాజీ (కోల్‌కతా)

బ్రిటన్లో పారిశ్రామిక విప్లవం తర్వాత కలకత్తాకు దగ్గరలో గంగానదికి ఇరువైపులా రకరకాల పరిశ్రమలు వెలిశాయి. ముఖ్యంగా జూట్ మిల్లులు పెద్ద సంఖ్యలో నిర్మాణమయ్యాయి. ఈ లేబర్ ఇనెన్సివ్ కార్మాగారాల్లో పనిచేయడానికి అధిక సంఖ్యలో కార్మికులు అవసరమయ్యారు. సరిగ్గా ఆ సమయం సరికి దేశంలోని గ్రామీణ ప్రాంతాల్లో ఫ్యూడల్ శ్రమ సంబంధాలు కొనసాగుతున్నాయి. తమ శారీరక శ్రమ మీద మాత్రమే ఆధారపడి బ్రతికే వ్యవసాయ కూలీల జీవితాలు దుర్భరంగా వున్నాయి. మరోవైపు యంత్ర నాగరికత దెబ్బతో చేతివృత్తుల వారి జీవితాలు కూడా కుదేలయ్యాయి. బెంగాలు మిల్లుల్లో కార్మికుల అవసరం ఉందన్న వార్త వీరందరికీ సువర్ణావకాశంలా వినిపించింది. పెట్టే బేడా సర్దుకుని బీహారు, పశ్చిమ ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, ఉత్తరాంధ్రల నుండి నిర్దిష్టమైన జీతాల కోసం, కాస్త మెరుగైన జీవితాల కోసం లక్షలాది మంది వలస వచ్చారు.

## టీటాఘడ్ కు తెలుగు వారి వలస:

ఇక్కడికొచ్చిన తెలుగు వారు ముఖ్యంగా ఒరిస్సాలోని గంజాం జిల్లా, ఉత్తరాంధ్రలోని శ్రీకాకుళం జిల్లాల నుండి వచ్చారు. నదికి తూర్పు వైపున ఉత్తర 24 పరగణాలు జిల్లాలో టిటాగడ్, సోపూర్, ఆగర్పం , కమర్టీ , గరులియా, శ్యాంనగర్, ఆథ్ పూర్,జగద్దల్, నైహాటీ వంటి ప్రాంతాల్లో, అలాగే నదికి పశ్చిమ వైపున హుగ్లీ జిల్లాలో కోన్నగర్, మహేశ్, చాప్టానీ, శక్కుగాన్, శ్రీరాంపూర్,

బద్రేశ్వర్, తెలినిపరా, గొండల్పరా వంటి ప్రాంతాల్లో, అలానే హౌరా జిల్లాలోని శివ పూర్, సంత్రాగా చీ, చెంగైల్ లాంటి ప్రాంతాల్లో తెలుగు వారు మిల్లు కార్మికులుగా స్థిర నివాసాలు ఏర్పరుచుకున్నారు. కొంత మందికి మిల్లు వారు మిల్లు క్వార్టర్లు ఇచ్చారు. ఇంకొంత మంది చిన్న చిన్న పెంకుటిళ్లలో అద్దెకు చేరారు. వివిధ ప్రాంతాల్లో స్థిరపడ్డ తెలుగు వారి సంఖ్య వేర్వేరుగా ఉంటుంది. అన్నింట్లోకీ తెలుగు వారు ఎక్కువగా ఉండే ప్రాంతం టి గడ్, ఉత్తర 24 పరగణాలు జిల్లాలో కలకత్తాకు దగ్గరలో (ప్రస్తుతం గ్రేటర్ కోల్‌కతాలో అంతర్భాగంగా) గంగానది వొడ్డున ఉన్న పారిశ్రామిక పట్టణమిది. ఇక్కడ దాదాపు లక్షమంది తెలుగు వారు నివాసముంటున్నారు. అందుకే ఇది ఈ చుట్టుప్రక్కల ప్రాంతాల వారికి తెలుగు రాజధానిలా కనిపిసస్తుంది.

టిటాగర్లో తెలుగు వారు అధికంగా ఉండడానికి ఒక కారణముంది. అప్పట్లో టిటాగడ్ జూట్ మిల్ నెం.1 అనే ఒకే ఒక జూట్ మిల్లు ఉండేది. దీనిని 1882 సం లో స్థాపించారు. అందులో యుధిష్టరుడు అనే తెలుగాయన పనిచేసేవారు. ఈయన గంజాం జిల్లాలోని రసుల్ కొండ గ్రామవాసి. మిల్లులోని దుర్గంధాన్నీ, రసాయనాల వాసనల్నీ భరించలేక చాలామంది పనులు చేయలేకపోయేవారు. కానీ యుధిష్టరుడు మాత్రం కుటుంబాన్ని పోషించాలనే తపనతో ఎంత కష్టమైనా మొండిగా ఆ వాతావరణానికి అలవాటు పడి పనిచేశాడు. అతడ్ని చూసిన మిల్లు యాజమానులు ఆంధ్రులు కష్టపడి పనిచేయగలరని తలచి, మరి కొంతమందిని తనతో తీసుకురమ్మని ఒప్పించి ఛార్జీలు ఇచ్చి మరీ పంపించారు. అలా ఆయన గంజాం, శ్రీకాకుళం గ్రామాల నుండి చాలా మందిని తీసుకు వచ్చాడు. వారిని చూసి ఇంకొంత మంది తర్వాతి కాలంలో వచ్చారు.

## విద్యాలయాల నిర్మాణం:

మిల్లుల్లో వారానికొకసారి దొరికే జీతాలను హిందీలో 'హప్తా'లంటారు. సరిగ్గా ప్రతి వారం జీతం రాళ్లు చేతిలో పడ్డంతో జీవితాలు కుదుటపడ్డాయి. 'తిండి-గుడ్డ-గూడు' అవసరాలు తీరాయి. విద్యకు సంబంధించిన ఆలోచన పెద్దగా ఉండేది కాదు. కాలక్రమేణా స్వాతంత్ర్యానంతర కాలంలో ఇక్కడ నివసించే తెలుగు వారిలో కీ. శే. యర్ర తరణీరావు లాంటి ఒకరిద్దరు ఆంధ్రా మెట్రిక్యులేషన్ పరీక్షలు వ్రాసి చదవరులనిపించుకున్నారు. వీరంతా అవే పరిశ్రమల్లో క్లర్కులై మేధో -19652

శ్రామికులయ్యారు. వ్యాపారాలు చేసుకుని కొంత అభివృద్ధిలోకి వచ్చిన వారూ లేకపోలేదు. మెల్ల మెల్లగా శ్రామికుల బిడ్డలకు కూడా నాలుగు అక్షరాలు నేర్పించే విద్యాలయాలు అవసరం అనే ఆలోచన వచ్చింది. 1943 సంవత్సరం స్థాపితమైన 'టిటాగడ్ ఆంధ్ర సంఘం' అనే సంస్థ సహకారంతో 1960 లో ఒక స్థలాన్ని కొని భవన నిర్మాణం చేపట్టారు. ఇక్కడి కార్మికులు ఒక్కో రూపాయి చందా వేసుకుని ఈ విద్యాలయ నిర్మాణానికి సహకరించారు. మొదట తడకల గదులతో, పెంకుటిల్లతో అంచెలంచెలుగా ఎదిగి ఈ రోజు పన్నెండో తరగతి వరకు మాతృభాషలో బోధించే మూడంతస్తుల భవనంగా ఎదిగింది “టిటాగడ్ ఆంధ్ర విద్యాలయం'. మొదట్లో విద్యాలయ కమిటీ ఇచ్చే చిన్న చిన్న జీతాలతో పార్ట్ టైమ్ ఉపాధ్యాయులు పనిచేశారు. తర్వాత్తర్వాత విద్యాలయం ప్రభుత్వామోదం సంపాదించడంతో ప్రభుత్వ జీతాలు పుచ్చుకునే శాశ్వత ఉపాధ్యాయులు వచ్చారు. టిటాగడ్ ఆంధ్ర విద్యాలయం ప్రారంభం కాకముందే ఇదే వూరిలో జ్యోతిర్మయ యువజన విద్యా కేంద్రం అనే మరో స్కూలు ప్రారంభమైంది.

ఇక్కడ్నుంచి విద్యార్థులను ఆంధ్రా మెట్రిక్యులేషన్ కోసం ప్రిపేర్ అయ్యేవారు. ఈ విద్యాలయానికి ప్రభుత్వామోదం కొంత ఆలస్యంగా లభించింది. నేడు ఇది కూడా ఒక ప్రభుత్వామోదిత హై స్కూలుగా పనిచేస్తోంది. ఇదే తరహాలో హుగ్లీలో మహేష్ శ్రీ పొట్టి శ్రీరాములు ఆంధ్ర హై స్కూల్ ఉనికిలోకి వచ్చింది. పలుప్రాంతాల్లో పనిచేస్తున్న ప్రభుత్వామోదిత ప్రాథమిక పాఠశాలలు ఈ హై స్కూళ్లకు కావలసిన విద్యార్థులను సరఫరా చేస్తున్నాయి. ఇలా విద్యావ్యాప్తి జరగడంతో చదువుకున్న తెలుగు యువకులు బ్యాంకులు, రైల్వేలు, ప్రభుత్వ కార్యాలయాల్లో ఉద్యోగాలు సంపాదించి శ్రామిక శ్రేణి నుండి మధ్య తరగతిలోకి జంప్ అయ్యారు. ఇదంతా ఒక్క రోజులో, ఒక్క సంవత్సరంలో జరిగిన పరిణామం కాదు. కొన్ని దశాబ్దాలుగా ఈ మార్పు జరిగింది. ఈ ప్రాంతంలోని పలు కళాసాంస్కృతిక సంఘాల తరుపున తోలుబొమ్మలాటలూ, ఆ తర్వాత ముమ్ముందు నాటకాలూ, హరికథలు, బుర్రకథలూ, సినిమాలూ ప్రదర్శితమయ్యాయి.

## 'ముందడుగు' నేపథ్యం:

టిటాగడ్ లో టి. ఎస్. గ్రీవార్స్ తెలుగు గ్రంథాలయం అన్న పేరుతో ఓ గ్రంథాలయం వుంది. ఇది నేడు 25,000 గ్రంథాలతో ప్రభుత్వామోదం పొందిన గ్రంథాలయం, అరుదైన 'భారతి', 'కృష్ణా' పత్రికలు కూడా ఇక్కడ లభిస్తాయి. పాఠకుల కార్నర్ లో తెలుగు దిన, వార, మాస పత్రికలు చదవరుల కోసం రెడీగా వుండేవి. ఈ సాహిత్య సాంగత్యంలోకి వచ్చిన కొందరు యువకులు విద్యార్థి దశలోనే మంచి సాహిత్యంపై, క్రమంగా ప్రగతిశీల కమ్యూనిస్టు సాహిత్యంపై అభిరుచి పెంచుకున్నారు. వారి అవగాహనను పెంచిన పుస్తకాల్లో గోరా, రంగనాయకమ్మ, నండూరి రామ్మోహనరావు, చలం, తాపీ ధర్మారావు,

శ్రీశ్రీ, రావి శాస్త్రి గారి రచనలూ, ప్రజాసాహితి, సృజన లాంటి పత్రికలూ, సోవియట్ రష్యా నుండి సరసమైన ధరలకు లభించే పుస్తకాలూ చాలా ప్రభావం చూపాయి. బెంగాలు వామపక్ష రాజకీయాల ప్రభావం ఎటూ వుంది. ఈ లైబ్రరీలో లభించని పుస్తకాలనూ, పత్రికలనూ వ్యక్తిగత

స్థాయిలో పోస్టు ద్వారా రప్పించుకుని చదివేవారు ఈ యువకులు. తమ వద్ద ఉన్న పుస్తకాలను ఒకచోటికి పోగేసి 1987 లో 'సోషల్ లైబ్రరీ' ఏర్పాటు చేశారు. ఆర్థిక ఇబ్బందుల వలన తాము చదువుకునే రోజుల్లోనే, చిన్న తరగతుల వారికి ట్యూషన్లు చెప్పాల్సిన పరిస్థితి ఈ యువకులది. ట్యూషన్ పాఠాల మధ్యలో వినిపించే కొన్ని కొన్ని అభ్యుదయ భావాల శకలాలు ఆ విద్యార్థులను విశేషంగా ఆకర్షించేవి. సోషల్ లైబ్రరీ' పుస్తకాలు వారి ఆలోచనలను మరింత పదునెక్కించేవి. ఇలా సమభావాల యువకులు, విద్యార్థుల బృందం ఏర్పడింది. వీరిలో కొందరికి అప్పటికే విద్యాలయ వార్షిక పత్రికల్లో రాసే అలవాటు వుంది.

## ఎందుకు 'ముందడుగు' పత్రిక?

ఆనాడు (ఈనాడు కూడా) ప్రాచుర్యంలో ఉండిన వార, మాస పత్రికలు సినీతారల ముఖచిత్రాలతో సెక్స్, క్రైం, భూత ప్రేతాలతో, అధమ విలువలనూ, ఫ్యూడల్, బూర్జువా భావజాలాన్ని వ్యాప్తి చేసే కంటెంట్ తో వుండేవి. శ్రమజీవి శ్రేయస్సును కాంక్షించే సంగతులకు వాటిలో చోటే లేదు. అందుకే ఒక ప్రాంతీయ ప్రత్యామ్నాయ పత్రిక అవసరమనుకున్నారు. ఈ నవ యువకులు. ఒక సంపాదకీయంలో రాసుకున్నట్టు - 'సాహిత్యం సమాజానికి దర్పణం పట్టాలి. ఆ సమాజపు ఆర్థిక వ్యవస్థ నుంచి ఉద్భవిస్తున్న వైరుధ్యాలనూ, వైవిధ్యాలనూ, అసమానతలనూ, అసహజత్వాలనూ, రుగ్మతలనూ సునిశితంగా పరిశీలించి

వాటి అభివృద్ధి నిరోధకత్వాన్నీ, తిరోగమనాన్ని ఎత్తిచూపుతూ, ఉన్నతమైన మానవ సంబంధాలకూ, సృజనాత్మక శక్తికీ, వర్గచైతన్యానికీ, వర్గ దృక్పథానికీ సుగమం చేసే దిశలో సాహిత్యం కృషి చేయాలి. అది సమాజంలోని సమస్యలను కేవలం ఎత్తి చూపడమే కాకుండా, వాటిని తవ్వుకుంటూ లోపలికి పోయి అట్టడుగు భాగాన వున్న వాటి కారణాలనూ, మూలాల్ని పరిశోధించే సాహిత్యమే సమాజాభ్యున్నతిని ఆశిస్తుంది.' - అని తలచి అటువంటి దిశా నిర్దేశంతో పశ్చిమ వంగాంధ్రుల ప్రత్యేక సమస్యలు చర్చించే వేదికగా చిన్న స్థాయిలోనైనా ఒక రాత పత్రిక తీసుకురావాలనుకున్నారు. టిటాగ లో గతంలో రాష్ట్రేతరాంధ్ర జ్యోతి', 'వికాసం' అనే రెండు రాత పత్రికలు వచ్చాయి, కానీ కొద్ది సంచికలతోనే ఆగిపోయాయి. కాబట్టి ఆ తరహాలో కానీ నిరవధికంగా వెలువడే ప్రగతిశీల రాత పత్రిక అవసరమనుకున్నారు. చివరికి జులై 1990 లో 'సృజన' మాదిరిగా 'సాహితీ మిత్రులు' నిర్వహణలో 'ముందడుగు' చేరాత పత్రిక ప్రజాహిత మాసపత్రిక' అనే ట్యాగ్ తో ఆరంభమైంది. ఎం.కేశవరావు, వీ.వెంకటరావు, కే.రవి, ఏ.బాలాజీ, ఏ. రామారావు, టి. జోగారావు, వై. చలపతి, ఈ. ప్రకాశరావు, బీ. తారకేశు, కీ.శే. కే. వెంకటేశ్, హరిప్రసాద్, హరికేశవరావు, జనార్ధన, ఎం. హేమంత్, ఏ.గోపి, సూర్యారావు, సూర్యనారాయణ, వేణు, గిరి, రుషి, లోకేశ్, ప్రసాద్, లక్ష్మి, సర్వమంగళ, నిర్మల, ఏ. దుర్గారావు, మోహిని, దివిజ, జగదీశ్వరి, కోటేశు, శ్రీను తదితరులతో పత్రిక ఆరంభమైంది. పత్రికలో మంచి మంచి ముఖచిత్రాలు వేసిన లేక వేస్తున్న వారు హరికేశవరావు, హేమంత్, కవిత. సూర్యారావు చక్కని కార్టూన్లు వేసేవాడు. వీరందరూ ఆరంభం నుండి ఇప్పటి వరకూ ఉన్నారనీ కాదు. కొందరు కొంత కాలం తర్వాత వచ్చిన వారు వున్నారు. కొన్ని - కారణాల చేత విడిపోయి మళ్లీ

కలిసిన వారున్నారు. ఉ ఆద్యోగరీత్యా లేక పెళ్లి తర్వాత వేరే ప్రాంతానికి వెళ్లి దూరమైన ని వారున్నారు. కీ. శే. ఆనిమి శంకరరావు గారు పెద్దదన్నుగా ఎ ఉండేవారు. కీ.శే. బి. రామారావు, కీ.శే.ఎం. శరభారావు, కీ.శే. అల్లక లక్ష్మీనారాయణ, ఏ. వీరభద్రరావు గార్లు సలహాకమిటీ సభ్యులుగా సేవలందించారు.

## ముందడుగు' తొలి దశ ప్రయాణం:

మొదట్లో రెండే కాపీలతో ప్రారంభమైంది ఈ పత్రిక. సైన్సు రికార్డు బుక్కులో రూలు కాగితాల్లో రాతలూ, తెల్ల కాగితాలపై బొమ్మలూ అతికిస్తూ లేదా వేస్తూ సైన్సు నోట్సు రాస్తున్నట్టే రెండు కాపీలు చేత్తో ముందడుగు రాసేవారు. ఒకటి టి.ఎస్. గ్రీవార్స్ లైబ్రరీ కోసం, మరోటి ప్రైవేట్ సర్క్యులేషన్ కోసం! ఆ తర్వాత మూడు కాపీలు రాసి ఒక కాపీ శ్యాంనగర్ లోని శ్రీ సర్వజన మనోరంజని గ్రంథాలయానికి పంపించేవారు. జిరాక్సు యంత్రాలు అందుబాటులోకి వచ్చిన తర్వాత ఒక ప్రతిని రాసి మిగతావి జెరాక్సు చేయడంతో పని సులువైంది. పత్రికల సంఖ్య పెరుగుతూ 25 కి చేరింది. ఈ కాపీలను లైబ్రరీలూ, విద్యాలయాలతో పాటు, పెద్ద పెద్ద సాంస్కృతిక సంస్థలకే కాక చుట్టు ప్రక్కల ప్రాంతాల వారికీ పంపిణీ చేసేవారు. ఒక్కో కాపీని ప్రవాసాంధ్రుల అభ్యున్నతి కోసం పాటు పడిన మహానుభావుల పేర (వాకపల్లి సూర్యనారాయణ కాపీ, జామి కాళిదాసు కాపీ ఇలా) పంపిణీ చేసేవారు. పత్రిక ఆఖరో పాఠకులు తమ అభిప్రాయాలు రాయడానికి 'అభిప్రాయ వేదిక' అని ఖాళీ పేజీలు ఉంచేవారు. పత్రిక కోసం శ్రమజీవులు ఇచ్చే రెండు రూపాయల చందా కూడా ఆనందంగా స్వీకరించేవారు. ఈ చందాలను సేకరించడానికి 'సాహితీ మిత్రులు' ప్రతి ఆదివారం చందా బుక్కులతో బయల్దేరేవారు. ఈ

పత్రికలో ఎన్నో ప్రాచుర్యం పొందిన రచనలు వెలువడ్డాయి. టిటాగడ్ పరిసర ప్రాంతాల రంగస్థల చరిత్రనూ, కొంత ప్రవాసాంధ్ర చరిత్రనూ పొందుపరిచిన 'టిటాగడ్ రంగసలి' (రచయిత - ఆనిమి పార్వతీశం సాయిబాబు), పిల్లల కోసం ప్రగతిశీల భావాలతో 'నిత్యసుగుణశీల నీతిబాల' అనే కంద పద్యాలు (రచయిత - కీ.శే. ఎం. శరభారావు), మంచి మంచి సినిమా సమీక్షలు (బాలాజీ రాసినవి) వెలువడేవి. కేశవరావు 'ఆకలి' కథ తర్వాతి కాలంలో ఎన్నో అవార్డులు గెలుచుకుంది. జోగారావు రాసిన 'ట్రాం' కథ 'మేరల కావల' అనే అనే ప్రవాసాంధ్ర రచయితల సంకలనంలో స్థానం సంపాదించింది. కీ.శే. ఏ. లక్ష్మీనారాయణ గారు 'ముందడుగు' కోసం రాసిన కథల సంకలనం త్వరలో విడుదల కానుంది. ప్రకాశ్ జనపనార కార్మికులపై రాసిన వ్యాసాన్ని 'వీక్షణం' పున:ప్రచురించింది. బాలాజీ రాసిన ఎన్నో వ్యాసాలను ప్రజాసాహితి' వారు తమ సంచికల్లో పున: ముద్రించారు. చలపతి కార్మికుల కోసం ఈ.ఎస్.ఐ. గురించి రాసిన వ్యాసాలు, కీ.శే. సి.హెచ్. రాజారావు గురించి రాసిన వ్యాసాలు, కీ.శే. సి.హెచ్. రాజారావు రాసిన 'ఎలక్ట్రిక్ సర్క్యూట్' అనే వృత్తివిద్యకు సంబంధించిన శీర్షిక కూడా ఎంతో ప్రాచుర్యం పొందాయి. ఎన్నో ప్రత్యేక సంచికలతో పాటు అణు పరీక్షల సమయంలో వెలువడిన 'అణ్వస్త్ర వ్యతిరేక సంచిక' చాలా సమగ్రంగా ఒక మైలురాయిగా నిలుస్తుంది. ఈ ప్రాంతాల్లో వాడుక భాషను ప్రచారం చేయడంలో 'ముందడుగు' ప్రముఖ పాత్రను పోషించింది.

### ఆడియో-విజువల్ ప్రదర్శనల దశః

1990 జులై నుండి 2003 ఫిబ్రవరి వరకు రాత పత్రిక వెలువడింది. చాలా మంది సాహితీ మిత్రులు ఉ ద్యోగరీత్యా వేరే ప్రాంతాలకు వెళ్లిపోవడంతో పత్రిక సిబ్బంది కరువయ్యారు. ఈలోగా జరిగిన మరో పరిణామమేంటంటే ఒకే ఒక్క

డీడీ దశను దాటేసి వందల ఛానెళ్ల కేబుల్ టీవీ ప్రతి ఇంట్లోకి చొరబడడంతో, జనాలకు పత్రిక పఠనంలో ఆసక్తి తగ్గింది. ఎంతో కష్టపడి పంపిణీ చేసినా, పేజీలు నలక్కుండా పత్రిక తిరిగొచ్చేది. అందుకే ఆ దశలో పత్రికను ద్వైమాసిక సంచికగా వెలువరిస్తూ, ప్రజలకు ఆకర్షించే విధంగా దృశ్యశ్రవణ మాధ్యమాల ద్వారా ఎడ్యుకేట్ చేసే విద్యాసాంస్కృతిక సంస్థగా రూపాంతరం చెందింది 'ముందడుగు'. వ్యాసరచన పోటీలూ, డిబేటింగ్ పోటీలూ, సైన్సు ప్రదర్శనలూ, మ్యాజిక్ మిరాకిల్ షోలూ, టెలిస్కోపు ప్రదర్శనలు నిర్వహించింది. అణు విధ్వంసంపై, ఖగోళశాస్త్ర విషయాలపై, ఆరోగ్య సంబంధ విషయాలపై తెలుగు, హిందీ, బెంగాలీ భాషల్లో వందల కొలది ఫిల్మ్ స్లైడ్ షోలు ప్రదర్శించింది. 'జనసాహితి'తో కలిసి విజయవాడ, ఒంగోలు, శ్రీకాకుళం, చోడవరం తదితర చోట్ల వేసిన 'హిరోషిమా-నాగాసాకి' స్లైడ్ షోలు విశేష ఆదరణ పొందాయి. 'పెద్దతెరపై మాధ్యమిక జీవశాస్త్రం' అనే ఏనిమేషన్ కార్యక్రమం ఈ కార్మిక వాడల్లో ప్రదర్శితమైన ఈ మాదిరి ప్రప్రథమ కార్యక్రమంగా నిలిచింది. మానవ విలువలు అడుగంటుతున్న ఈ కాలంలో మనిషి హృదయంలోని తేమను ఆరనీకుండా ఉత్తమ చలన చిత్రాలనూ, లఘు చిత్రాలనూ, దాక్యుమెంటరీలనూ, పిల్లల సినిమాలను ప్రదర్శించడం కూడా 'ముందడుగు' ప్రాథమికతల్లో ఒకటిగా వుంది. ఫ్యాక్టరీలు మూతపడినప్పుడు కార్మికుల కోసం చందాలు సేకరించడం, పేదల కోసం మెడికల్ కాలేజీ మిత్రుల సహాయంతో ఉ చిత మెడికల్ క్యాంపులు నిర్వహించడం, అవసర సందర్భాల్లో రోగులను మెడికల్ కాలేజీలో చేర్పించడం వంటి కార్యక్రమాలు చేతనైన విధంగా చేసేవారు సభ్యులు. మెడికల్ కాలేజీ మిత్రులు 'ముందడుగు'లో 'ఆరోగ్యమే మహాభాగ్యం' అనే శీర్షికను నిర్వహించారు. మూతపడిన మిల్లుల కార్మికుల స్థితిగతులపై ఓ

డాక్యుమెంటరీని నిర్మించే ప్రయత్నం చేసింది 'ముందడుగు'. బాడీ మాస్ ఇండెక్స్ సర్వే చేసింది. టిటాగడో చిత్రలేఖన పోటీలూ, మ్యాజిక్ షోలూ, పుస్తక ప్రదర్శనలూ, సైన్సు ప్రదర్శనలతో పాటు ఓ లైబ్రరీని నిర్వహించిన 'చేతన' సంస్థ 'ముందడుగు'లో అంతర్భాగమైంది.

## అచ్చు పత్రిక ఆరంభం:

మెటల్ ప్రింటింగ్ యుగం అంతమైంది. కంప్యూటర్ ద్వారా పుస్తకాల కూర్పు, ప్రచురణ సులువైంది. ఈ దశలో 'ముందడుగు' రజతోత్సవం ఆసన్నమౌతుండగా అచ్చు పత్రికను ప్రారంభించాలని నిర్ణయించుకున్నారు 'సాహితీ మిత్రులు', 2015 మే ఒకటో తేదీ అంతర్జాతీయ కార్మిక దినోత్సవం సందర్భంగా సోద్ పూర్ లోక్ సంస్కృతి భవన్లో 'ముందడుగు' రజతోత్సవం జరిగింది. ఈ సందర్భంగా 'ముందడుగు' రజతోత్సవ సంచికగా 'మే-జూన్ 2015 అచ్చు పత్రిక వెలువడింది. ఈ కార్యక్రమంలో 'ముందడుగు' చరిత్రను తెలియజెప్పే స్లైడ్ షో వేశారు. సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. ఈ కార్యక్రమానికి స్థానిక పెద్దలతో సహా, “జనసాహితి' ప్రతినిధులూ, జనవిజ్ఞాన వేదిక పెద్దలూ హాజరయ్యారు. ఈ వేదిక నుండే అధిక భాగం 'ముందడుగు' సభ్యులతో “జన విజ్ఞాన వేదిక' పశ్చిమ బెంగాలు శాఖ ఆవిర్భావం జరిగింది.

## నిరంతర ప్రయాణం:

ఇప్పుడు ఈ అచ్చు పత్రిక త్రైమాసిక పత్రికగా వెలువడుతోంది. కరోనా కాలంలో కొన్ని సంచికల్ని కలిపి సంయుక్తంగా వెలువరిస్తున్నారు. ప్రతి యేడూ ఆగష్టు నెలలో ఆంధ్రా, తెలంగాణ రాష్ట్రాల పర్యటన చేస్తూ హైస్కూలు, కాలేజీ విద్యార్థుల కోసం స్లైడ్ షోలు యధావిధిగా జరుగుతున్నాయి. 'ప్రోగ్రెసివ్ ఫిల్మ్

ఫెస్టివల్' పేర రామచంద్రాపురంలో నిర్వహించిన చలన చిత్రోత్సవం చాలా విజయవంతమైంది. ప్రత్యామ్నాయ సినిమాల పట్ల వీక్షకులకు అవగాహన కలిగించడంలో సఫలీకృతమైంది. ఈ ఉత్సవం. త్వరలో హైదరాబాద్, కర్నూలు, రాజమండ్రి తదితర చోట్ల ఇటువంటి చలనచిత్రోత్సవాలు జరగనున్నాయి. 'వ్యక్తివాదం వికటాట్టహాసం చేస్తున్న నేపథ్యంలో సొంత లాభం కొంత మానుకుని, ఒకరికొకరం సహకరించుకునే బృహత్ పరివారం కోసం సాహితీ మిత్రులం ఆరాటపడుతున్నాం' అని రజతోత్సవ సంచికలోని సంపాదకీయం సంస్థ ఆశయాన్ని నివేదించింది. ఈ సమీకృత పరివారంలో (ఇంటిగ్రేటెడ్ ఫ్యామిలీ) మనమూ భాగమౌదామా?

**- ఐకా బాలాజీ (కోల్‌కతా)**

## 03. మనసుంటే మార్గం ఉంటుంది

-- కొండుభట్ల రామచంద్రమూర్తి, సకలం వెబ్ మేగ్జైన్, హైదరాబాద్

పాత్రికేయ వృత్తిలో ప్రజలకు మేలు చేసే కార్యక్రమాలు నిర్వహించిన సందర్భాలు కొన్ని ప్రస్తావిస్తూ వ్యాసం రాయమని గౌరవ్ అడిగారు. పాత్రికేయం అంటేనే ప్రజల పక్షాన నిలబడి ప్రపంచాన్నీ, ప్రభుత్వాలనూ పరిశీలిస్తూ మంచిచెడులను ప్రజలకు నివేదించడం. ఇది 1973లో నేను ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్నలిజం చదువుకున్నప్పుడు ప్రొఫెసర్ బషీరుద్దీన్ చెప్పిన మాట. సుమారు అయిదు పదుల పాత్రికేయ జీవితంలో ఈ సూత్రాన్ని సాధ్యమైనంతవరకూ పాటిస్తూ వచ్చాను.

ఎక్కువ సంవత్సరాలు డెస్క్ లో పని చేశాను. ఒక ఐటమ్ ని పరిశీలించినప్పుడు అది పత్రికలో ప్రచురించాలా లేదా టీవీలో ప్రసారం చేయాలా లేక బుట్టదాఖలు చేయాలా అనే నిర్ణయం తీసుకోవడానికి ముందు ఒకే ఒక అంశం పరిశీలించేవాడిని. ఆ ఐటమ్ వల్ల ప్రజలకు, సమాజానికి మేలు జరుగుతుందా, లేదా? జరుగుతుందంటే పత్రికలో ప్రచురించాలి, ప్రసారం చేయాలి. లేదంటే బుట్టలో వేయాలి. పరిమితులు అతి స్వల్పంగా ఉన్న సంస్థలలోనూ, ప్రతిబంధకాలు ఎక్కువగా ఉన్న సంస్థలలోనూ సంపాదకుడిగా, సంపాదకవర్గంలో ముఖ్యుడిగా పని చేసిన నాకు చేదు అనుభవాలూ, తీపి జ్ఞాపకాలూ ఉన్నాయి. పాత్రికేయ వృత్తిలో ఉన్నవారికి ఈ మిశ్రమ అనుభవం అనివార్యం.

ప్రజాస్వామ్యం భ్రష్టుపట్టిందనీ, ప్రజాస్వామ్య వ్యవస్థలోని అన్ని అంగాలూ కుళ్ళిపోయాయనీ వాదించే, వాపోయే వారు ఎప్పుడూ ఉంటారు. నేను జర్నలిజంలో చేరిన కొత్తల్లోనే ఇటువంటి ఫిర్యాదులూ, నిర్వేదాలూ విన్నాను.

గుండెలు బాదుకోవడం చూశాను. ఇప్పుడూ వింటున్నాను. చూస్తున్నాను. ఒక్క మీడియా రంగమే కాదు, ప్రజాస్వామ్య సౌధాన్ని నిలబెడుతున్న చట్టసభలూ (లెజిస్లేచర్), న్యాయవ్యవస్థ(జుడీషియరీ), అధికారగణం(ఎగ్జిక్యుటీవ్)తో పాటు మీడియారంగం కూడా కాలక్రమేణా బలహీనపడిందన్న మాట వాస్తవం. విలువల పతనం జరిగిందనడానికి ఎవ్వరికీ అభ్యంతరం ఉండదు. మీడియా ప్రశ్నించే శక్తి కోల్పోతోంది. వస్తునిష్ఠంగా రాసే, చూపించే స్వేచ్ఛ ఉండటం లేదు. రాజకీయపార్టీల ప్రమేయం పెరుగుతోంది. రాజకీయ నేతలతో మీడియా సంస్థల అధిపతులు మమేకం కావడం మితిమీరిపోతోంది. మీడియా యాజమాన్యం కార్పొరేట్ రంగం హస్తగతం అవుతోంది. అందుకు తగినట్టుగానే చాలామంది జర్నలిస్టులు యజమానులు నడిచిన బాటలోనే, వారి అడుగులకు మడుగులొత్తుతూనే నడుస్తున్నారు. ఆత్మప్రబోధం వల్లనో, ఆత్మగౌరవం వల్లనో ఆ విధంగా నడవలేకపోతే పైదొలుగుతున్నారు. మీడియాకు దూరంగా జరుగుతున్నారు. ఒక పత్రిక లేదా ఒక టీవీ చానల్ లేదా ఒక వెబ్ సైట్ సంపూర్ణంగా, సర్వదా ప్రజల పక్షాన నిలిచి పోరాడాలంటే ఈ రోజుల్లో అది సాధ్యం కాకపోయినా ప్రజలకు ఎంతోకొంత మేలు చేసే అవకాశం ఇప్పటికీ ఉంది. ఈ విషయం వివరించేందుకు నేను నాలుగైదు అనుభవాలు నివేదిస్తాను.

తొమ్మిదేళ్ళు బెంగళూరు, విజయవాడలలో 'ఆంధ్రప్రభ' సంస్థలో పని చేసిన తర్వాత 1984 డిసెంబర్ లో 'ఉదయం' పత్రిక విజయవాడ ఎడిషన్ ను ప్రారంభించే అవకాశం నాకు వచ్చింది. బెంగళూరులో ఆత్యయిక పరిస్థితిని ప్రతిఘటిస్తూ పని చేసిన సమయంలో ఎదురైన ఆటుపోట్లూ, విజయవాడలో కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం సంపాదకత్వంలో అజంతా పర్యవేక్షణలో

ఆంధ్రప్రభలో పని చేసిన అనుభవం నాకు 'ఉదయం'లో పనికి వచ్చాయి. ఏబీకే ప్రసాద్ 'ఉదయం' పత్రికకు సంపాదకత్వం నిర్వహిస్తూ హైదరాబాద్ లో ఉండేవారు. ఆయన నుంచి ఏ మాత్రం జోక్యం ఉండేది కాదు. యజమానిగా దాసరి నారాయణరావు ఉన్నంత వరకూ అపరిమితమైన స్వేచ్ఛ. పైగా పరిశోధనాత్మక జర్నలిజం చేసిన సందర్భాలలో దాసరి విలేఖరులను మనస్ఫూర్తిగా అభినిందించేవారు. ఏబీకే ప్రోత్సాహం ఎట్లాగూ ఉండేది.

ఆ రోజుల్లో పీపుల్స్ వార్ గ్రూప్ (పీడబ్ల్యూజీ) కార్యకలాపాలు విస్తారంగా ఉండేవి. ఆ సంస్థ ప్రధాన కార్యదర్శి కొండపల్లి సీతారామయ్య విశాఖపట్టణం 'ఉదయం' విలేఖరి రమణమూర్తికి పిలిచి అద్భుతమైన ఇంటర్వ్యూ ఇచ్చారు. నక్సలైట్ల సిద్ధాంతం పట్ల భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ ప్రజల కోసం, సమాజం కోసం ప్రాణాలు సైతం లెక్క చేయకుండా పోరాడుతున్నారనే అభిమానం పాత్రికేయులతో సహా చాలామందికి ఉండేది. విప్లవకారులంటూ ఎన్ టి రామారావు నక్సలైట్లను పొగుడుతూ తొలి ఎన్నికల ప్రచారం చేసినప్పటికీ అధికారంలో కుదురుకున్న తర్వాత ఎన్ కౌంటర్ల మొదలయ్యాయి. ఆయన తర్వాత ముఖ్యమంత్రులుగా పని చేసినవారిలో మర్రి చెన్నారెడ్డి కొంతకాలం నక్సలైట్ల పట్ల ఉదారంగా ఉన్నారు. కానీ తర్వాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ముఖ్యమంత్రుల హయాంలో పోలీసు అధికారులకు పూర్తి స్వేచ్ఛ ఉండేది. 1995లో ఎన్ టి రామారావును తోసిరాజన్న తర్వాత చంద్రబాబునాయుడు పాలనలో గ్రేహౌండ్స్ కు సర్వాధికారాలు ఉండేవి. ఎన్ కౌంటర్లు పెరిగాయి. అయితే చంద్రబాబునాయుడు అధికారంలోకి రావడానికి మూడు మాసాలకు ముందే 25 మే 1995న 'ఉదయం' శాశ్వతంగా మూతపడింది. అంతవరకూ ఏ నక్సలైట్ ను కానీ నక్సలైట్ల సానుభూతిపరులను కానీ పోలీసులు రాత్రి పూట

అరెస్టు చేస్తే నూటికి ఎనబైశాతం అది వార్తగా 'ఉదయం'లో వచ్చేది. మిగతా పత్రికలలో కంటే ఉదయంలో నక్సలైట్ల వార్తలు విరివిగా ప్రచురణ పొందేవి. అరెస్టయిన నక్సలైటు లేదా సానుభూతిపరుడి ప్రాణాలు దక్కేవి. వారిని కోర్టులో ప్రవేశపెట్టేవారు. వార్త రాకపోతే మాత్రం మర్నాడు ఏ అడవికో తీసుకొని వెళ్ళి వారిని కాల్చి చంపివేసి వారిపక్కన ఒక తుపాకీనీ, నక్సలైటు సాహిత్యాన్నీ పెట్టి ఎన్ కౌంటర్ జరిగిందని ప్రకటించేవారు. ఆ వార్తకు మొదటి పేజీలో రెండు కాలమ్ ల ఐటంగా ప్రచురించేవాళ్ళం. తర్వాత రెండు, మూడు రోజులకు డాక్టర్ బాలగోపాల్ నాయకత్వంలో నిజనిర్ధారణ సంఘం ఘటనాస్థలికి వెళ్ళి, దర్యాప్తు చేసి హైదరాబాద్ తిరిగి వచ్చి విలేఖరుల గోష్ఠి నిర్వహించి నిజం వెల్లడించేవారు. దానికి నాలుగైదు కాలాలతో వార్త మొదటి పేజీలో ప్రముఖంగా ఇచ్చేవాళ్ళం. అది పాత్రికేయులకు బాలగోపాల్ నిజాయితీ పట్ల ఉన్న విశ్వాసానికి నిదర్శనం. ఆ రోజుల్లో నక్సలైట్లకు సాధారణ ప్రజలు ఆశ్రయం ఇచ్చేవారు. ప్రభుత్వాలు సైతం భరించి మిన్నకుండేవి. ఈ రోజుల్లో అయితే 'అన్ లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్ (ఉపా)' కింద సంపాదకుడినీ, విలేఖరినీ, నక్సలైట్లకు ఆశ్రయం ఇచ్చినవారినీ అరెస్టు చేసి వరవరరావు, ప్రొఫెసర్ సాయిబాబా, సుధాభరద్వాజ్ లనూ, తదితరులనూ పెట్టినట్టు జైల్లో పెట్టేవారు (రాజద్రోహం చట్టం-సెడిషన్ యాక్ట్- కంటే ప్రమాదభూయిష్టమైన ఈ చట్టం కింద కడచిన ఏడేళ్ళలో 10, 552 మందిని అరెస్టు చేసి జైల్లో పెట్టారు). నేను చేయదలచుకున్న పనులు చేయడానికి అవసరమైన వాతావరణం, స్వేచ్ఛ నాకు లభించింది 'వార్త' సంపాదకుడిగా పని చేసిన రోజుల్లో. 'దళిత్ డైరీ' అని ఒక వీక్లీ కాలమ్ ను వార్తలో ప్రారంభించి ఢిల్లీకి చెందిన చంద్రభాన్ ప్రసాద్ చేత రాయించాం. దళితుల సమస్యలూ, తెలంగాణవాదం, పౌరహక్కుల పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపుతూ అనేక

వ్యాసాలూ, వ్యాఖ్యలూ ప్రచురించేవాళ్ళం. పాఠకాదరణ విశేషంగా పెరిగింది. తెలుగు చదవడం రాని యజమాని గిరీష్ సంఘీ పత్రిక సర్క్యులేషన్ పెరుగుతోంది కనుక, పత్రికను అందరూ మెచ్చుకుంటున్నారు కనుక నా పనికి అభ్యంతరం చెప్పలేదు.

నేనే ప్రధాన నిర్వాహకుడిగా పని చేసిన సంస్థ హెచ్ఎంటీవీ. ఆంధ్రజ్యోతి సంపాదకుడిగా బాధ్యతల నుంచి తప్పుకొని న్యూస్ చానల్ నెలకొల్పే పని ప్రారంభించాను. హైదరాబాద్ మీడియా హౌస్ అనే సంస్థ హెచ్ఎంటీవీని నెలకొల్పింది. ఆ సంస్థకు చైర్మన్ కసుగంటి వామనరావు (కపిల్ చిట్ ఫండ్స్ యజమాని), నేను మేనేజింగ్ డైరెక్టర్. హెచ్ఎంటీవీ ప్రారంభించిన తర్వాత రెండేళ్ళకు 'ద హన్స్ ఇండియా' అనే ఇంగ్లీషు దిన పత్రికను మొదలు పెట్టాం. 'హెచ్ఎంటీవీ'కీ, 'ద హన్స్ ఇండియాకూ' సీఈవోనూ, చీఫ్ ఎడిటర్ నూ కూడా నేనే. వామనరావు మీడియా రోజువారీ కార్యకలాపాలలో జోక్యం చేసుకునేవారు కాదు. నాకు నచ్చిన విధంగా, ప్రజలు మెచ్చే విధంగా, పూర్తి నిజాయతీగా, నిర్భీతితో చానల్ నూ, ఆంగ్ల దినపత్రికనూ నడిపించడానికి అది ఒక సువర్ణావకాశం. ప్రత్యక్షంగా ప్రజల తరఫున నిలిచి పోరాటం చేసిన సంతృప్తి ఆ సంస్థను నిర్వహించినప్పుడు అత్యధికంగా లభించింది.

గల్ఫ్ దేశాలలో ఉద్యోగాల నిమిత్తం ఇక్కడి నిరుద్యోగులూ, చిరుద్యోగులూ ఆశపడి, అప్పులు చేసి, వీసాలూ, ఉద్యోగాలూ సంపాదించుకొని వెడుతున్నారు. వారిలో వివాహితులూ, సంతానం కలిగినవారు కూడా ఉంటారు. వారు వెళ్ళిన తర్వాత ఆరేడు మాసాలపాటు క్రమం తప్పకుండా భార్యాబిడ్డలకు ఫోన్లు చేస్తూ, డబ్బు పంపుతూ ఉంటారు. అకస్మాత్తుగా ఫోన్లు ఆగిపోతాయి. డబ్బు రాదు. ఏమైపోయారో తెలియదు. ఇక్కడ మాసాల తరబడి, సంవత్సరాల తరబడి

నిరీక్షణ. గల్ఫ్ వెళ్ళిన భర్త బతికి ఉన్నాడో, జైల్లో ఉన్నాడో, ఎవరికైనా బానిసగా ఉన్నాడో తెలియదు. బతికే ఉన్నాడనీ, ఎప్పుడో ఒకప్పుడు వస్తాడనే ఆశతో భార్యలూ, కుటుంబసభ్యులూ వేచి చూస్తూ బతుకులు వెళ్ళదీస్తుంటారు. వారి గోడు సమాజానికి వినిపించడంకోసం కరీంనగర్ లో 'గల్ఫ్ గాయం' అనే కార్యక్రమాన్ని నిర్వహించాం. కరీంనగర్ పోలీసు సూపరింటెండెంట్ ఆ కార్యక్రమంలో పాల్గొన్ని అన్ని వివరాలూ రాసుకొని దర్యాప్తు చేయిస్తానంటూ మాట ఇచ్చారు.

ఆ రోజుల్లో రైతుల ఆత్మహత్యలు అధికంగా జరిగేవి. ఇప్పుడూ జరుగుతున్నాయి కానీ అప్పుడు మరీ విపరీతం. ఆత్మహత్యలకు పాల్పడిన రైతుల భార్యలతో సిద్ధిపేటలో ఒక సమావేశం నిర్వహించాం. దానికి హాజరైన ప్రస్తుత తెలంగాణ ఆర్థిక, ఆరోగ్య మంత్రి తెన్నేటి హరీష్ రావు (అప్పుడు టీఆర్ఎస్ శాసనసభ్యుడు) సమావేశం పూర్తయ్యే వరకూ ఉన్నారు. సమావేశం వీడియోను నాటి వ్యవసాయ మంత్రి రఘువీరారెడ్డికి సమర్పించాం. ఆత్మహత్య చేసుకున్న రైతుల కుంటుంబాలకు పరిహారం ఇప్పించే ఏర్పాట్లు పకడ్బందీగా చేస్తామని మాట ఇచ్చారు.

విశాఖపట్టణం ప్రాంతీయ ప్రతినిధి మాశర్మ సహకారంతో ఉద్దానంలో మూత్రపిండవ్యాధికి గురైనవారితో ఒక కార్యక్రమం చేశాం. శ్రీకాకుళం జిల్లాలలోనే సోంపేటలో థర్మల్ విద్యుత్ కార్మాగారాన్ని ఏటా మూడుపంటలు పండే వ్యవసాయ క్షేత్రాలలో నిర్మించాలన్న పథకాన్ని వ్యతిరేకిస్తూ స్థానిక వైద్యుడు డాక్టర్ వై కృష్ణమూర్తి నాయకత్వంలో ఉద్యమించిన ప్రజల పక్షాన నిలబడి అక్కడ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ ఏర్పాటు చేసి చర్చా కార్యక్రమం ద్వారా ప్రజల మనోభావాలను ప్రపంచానికి చాటాం. ఈ  కార్యక్రమానికి విశాఖ విలేఖరి రత్నం

(పర్యావరణ కార్యకర్త) సహకరించారు. విశాఖ సముద్రతీరంలో ఎర్రమట్టిదిబ్బలను ఆక్రమించే ప్రయత్నాన్ని నిరోధించేందుకు మాజీ ఐఏఎస్ అధికారి ఈఏఎస్ శర్మ, ఆయన సతీమణి రాణీశర్మ సహకారంతో ఒక వేదికను ఏర్పాటు చేసి నిర్వహించాం. విశాఖలో కాలుష్యంపైన కూడా ఒక కార్యక్రమం చేశాం.

నల్లగొండ జిల్లాలో ఫ్లోరైడ్ బాధితులలో అవగాహన పెంచడం కోసం పదిహేను రోజుల కార్యక్రమం చేపట్టాం. ఫ్లోరైడ్ బాధిత గ్రామాలలో పాదయాత్ర చేస్తూ ప్రతి రోజు సాయంత్రానికల్లా ఏదో ఒక గ్రామం చేరుకొని అక్కడ బహిరంగసభ ఏర్పాటు చేశాం. ఒక రోజు గద్దర్, మరో రోజు నారాయణమూర్తి (సినీనటుడు), ఇంకో రోజు చుక్కారామయ్య, ఆ తర్వాత డాక్టర్ రాజారెడ్డి, తదితరులు ముఖ్య అతిథులుగా పాల్గొని ఫ్లోరైడ్ సమస్యపైన ప్రసంగాలు చేశారు. అన్ని కార్యక్రమాలకూ నేను హాజరయ్యాను. మూసీనది కాలుష్య కాసారమైన సంగతి తెలిసిందే. దాన్ని పరిశుభ్రం చేయాలనీ, దానిలోకి విషపదార్థాలను విడుదల చేసే రసాయనిక కర్మాగారాలను దూరంగా తరలించాలనీ 'మూసీ బచావ్' (మూసీని రక్షించండి) అనే నినాదంతో ఒక కార్యక్రమాన్ని నిర్వహించాం. అనంతగిరి (వికారాబాద్ దగ్గర) లో మూసీ పుట్టిన చోటు నుంచి కృష్ణానదిలో విలీనమయ్యే వాడపల్లి వరకూ ఈ కార్యక్రమం ప్రజల ప్రమేయంతో బాగా జరిగింది. ఈ విధంగా సమాజం ఎదుర్కొంటున్న అనేక సమస్యలను గుర్తించి వాటిపట్ల ప్రజలలో అవగాహన పెంచేందుకు ప్రజల మధ్యకు వెళ్ళి ప్రజల భాగస్వామ్యంతో కార్యక్రమాలు నిర్వహించడం హెచ్ఎంటీవీ ప్రత్యేకత. ఇటువంటి కార్యక్రమాలకు పరాకాష్ఠ 'ఆంధ్రప్రదేశ్ దశ-దిశ' కార్యక్రమం.

అది 9 డిసెంబర్ 2009. పన్నెండేళ్ళకు పైగా సాగుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమం కీలకదశకు చేరుకున్నది. టీఆర్ఎస్ అధినేత కల్వకుంట్ల చంద్రశేఖరరావు నిరవధిక నిరాహారదీక్ష పన్నెండో రోజు చేరుకున్నది. నాటి ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య దిల్లీ వెళ్ళి హోంమంత్రి పి. చిదంబరంతో చర్చలు జరిపి తిరిగి హైదరాబాద్ బయలుదేరారు. అంతలో ప్రధాని మన్మోహన్ సింగ్ తెలంగాణ ఉద్యమానికి పితామహుడు అనదగిన ఆచార్య జయశంకర్ తో ఫోన్ లో మాట్లాడారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేసేందుకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించిందని రోశయ్య ప్రయాణంలో ఉండగానే అర్ధరాత్రి చిదంబరం ప్రకటన చేశారు. ప్రొఫెసర్ జయశంకర్ ఇచ్చిన నిమ్మరసం సేవించి కేసీఆర్ దీక్ష విరమించారు. తెలంగాణలో పండుగ వాతావరణం. సీమాంధ్ర విషాదభరితం. సీమాంధ్రప్రాంతానికి చెందిన లగడపాటి రాజగోపాల్, కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు చెందిన ఇతర పార్లమెంటు సభ్యులు చిదంబరం ప్రకటనకు నిరసనగా రాజీనామా చేశారు. సీమాంధ్రప్రజలూ, రాజకీయ నాయకులూ ఆగ్రహంతో ఊగిపోతున్నారు. తెలంగాణ ప్రజల సంబరం ఒక రోజు కూడా సాగలేదు. తినడానికి సిద్ధంగా ఉన్న అన్నాన్ని ప్రత్యర్థులు నేలపాలు చేసినందుకు కోపగించిన తెలంగాణ నాయకులు వీరంగం వేశారు. సీమాంధ్ర రాజకీయనాయకులపైన ధ్వజమెత్తారు. సీమాంధ్ర నాయకులూ, తెలంగాణ నాయకులూ ఒకరి వాదన ఒకరు వినిపించుకోకుండా, ఒకరిని ఒకరు తిట్టుకుంటూ నిరసనజ్వాలలు చెలరేగిన దశలో రెండు పక్షాల చేత మాట్లాడించాలని సంకల్పించాం. చర్చ అన్నది ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రాణవాయువు అని నిరూపించదలచుకున్నాం. చిదంబరం ప్రకటన చేసిత తర్వాత రెండు వారాలు తిరగకముందే 20 డిసెంబర్ 2009న హైదరాబాద్

పబ్లిక్ గార్డెన్స్ లోని జుబిలీహాలులో 'ఆంధ్రప్రదేశ్ దశ-దిశ' కార్యక్రమం నిర్వహించాం. సుమారు అయిదు వందలమంది హాజరైనారు. అన్ని పార్టీల నాయకులూ, సమాజంలోఅన్ని రంగాల ప్రముఖులూ పాల్గొన్నారు. సాయంత్రం అయిదు గంటలకు కాంగ్రెస్ నాయకుడు తులసిరెడ్డి ప్రారంభించిన చర్చ రాత్రి పదకొండున్నరకు ప్రొఫెసర్ జయశంకర్ ప్రసంగంతో ముగిసింది. అన్ని పార్టీల నాయకులూ, ఇతర ప్రముఖులూ ముప్పయ్ మందికి పైగానే మాట్లాడారు. చర్చ మధ్యలో త్రిపురాన వెంకటరత్నం అనే కాంగ్రెస్ నాయకురాలు ఒక సవాలు విసిరారు. 'మీకు హైదరాబాద్ లో స్థానంబలం ఉన్నది కనుక ఇక్కడ ఇంతటి ఆవేశపూరితమైన అంశంపైనచర్చ పెట్టారు. దమ్ములుంటే ఇదే చర్చ ఆంధ్ర ప్రాంతంలో పెట్టండి చూద్దాం,' అన్నారు. ఒక రోజు చర్చకే ప్రణాళిక వేసుకున్నాం. రాష్ట్రమంతటా చర్చ గురించి ఆలోచించలేదు. ఆలోచించడానికి వ్యవధి కూడా లేదు. వెంటనే నేను సవాలును స్వీకరించాను. 'ఈ రోజు ఆదివారం. వచ్చే ఆదివారం తిరుపతిలో పెడతాం. పై ఆదివారం విశాఖపట్టణంలో నిర్వహిస్తాం. ఆపై వచ్చే ఆదివారం విజయవాడలో సభ జరిపిన తర్వాత వచ్చే ఆదివారం వరంగల్లులో పెడతాం. ఆ తర్వాత అనంతపురం, కరీంనగరం, నెల్లూరు.. ఇలా రాష్ట్రంలోని 23 జిల్లా కేంద్రాలలోనూ 'ఆంధ్రప్రదేశ్ దశ-దిశ' కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తాం' అని ప్రకటించాను. దాదాపు ఏడు మాసాలపాటు ఈ కార్యక్రమం నిర్వహించాం. ఈ కార్యక్రమంలో విశేషం ఏమంటే సభ సీమాంధ్రప్రాంతంలో జరిగితే తెలంగాణ నుంచి ఒక మేధావి హాజరవుతారు. తెలంగాణ ప్రజలు ప్రత్యేక  రాష్ట్రం ఎందుకు కోరుకుంటున్నారో వివరిస్తారు. సమైక్యవాదం వింటూ ఆవేశపడుతూ ఉన్న సభికులు విధిగా తెలంగాణ అతిథి ప్రసంగం ఆలకించాలి. అదే విధంగా తెలంగాణ జిల్లా కేంద్రంలో

సభ జరిగినప్పుడు సీమాంధ్ర నుంచి ఒక మేధావి హాజరవుతారు. తెలంగాణవాదం విటూ ఉర్రూతలూగుతున్న సభికులు ఆంధ్ర అతిథి అరగంట ప్రసంగం వినితీరాలి. ఈ సూత్రాన్ని అన్ని సభలలో అమలు చేశాం. ప్రారంభ సభలో (జుబిలీహాలు) అధ్యక్షవర్గంలో నేనూ, యాంకర్ కిరణ్ తో పాటు చుక్కారామయ్య, పొత్తూరి వెంకటేశ్వరరావు, ప్రొఫెసర్ హరగోపాల్, భూమన్, కత్తిపద్మారావు, తదితరులు కూర్చున్నారు. ప్రతిసభలోనూ వివిధ రంగాలకు చెందిన వ్యక్తులు అధ్యక్షవర్గంలో నాతో పాటు కూర్చునేవారు. సభను నేనే నిర్వహించేవాడిని. అత్యంత ప్రజాస్వామికంగా, సంచలనాత్మకంగా, ఎంతో ప్రయోజనాత్మకంగా జరిగిన ఈ కార్యక్రమం చరిత్రాత్మకమైనది. ప్రపంచ టీవీ చరిత్రలో ఇటువంటి కార్యక్రమం మరొకటి లేదు. దీని వీడియోలు జస్టిస్ శ్రీకృష్ణ కమిషన్ కు అందజేశాం. చివరికి ఆంధ్రప్రదేశ్ పునర్ వ్యవస్థీకరణ బిల్లు రాజ్యసభ ఆమోదం పొందిన తర్వాత సీమాంధ్ర ప్రాంతంలో హింసలేకపోవడానికి గల కారణాలలో ఈ కార్యక్రమం ఒకటన్నది నిర్వివాదాంశం.

ప్రజలు ఏ సమస్య ఎదుర్కొంటున్నా ఆ విషయం వార్తగా, దానిపైన వ్యాఖ్యగా చూపడంతో సరిపెట్టుకోకుండా ఆ సమస్య మూలాలలోకి వెళ్ళి పరిష్కారాలను వెతికే బాధ్యతను సైతం హెచ్ఎంటీవీ స్వీకరించింది. చివరగా ఒక అనుభవం మనవి చేస్తాను. 2010లో కశ్మీర్ లోయలో హింస బాగా చెలరేగింది. ముక్కుపచ్చలారని చిన్నారులు రాళ్ళు పట్టుకొని మెషిన్ గన్లకు ఎదురుగా నిలిచి నినాదాలు చేసేవారు. సైనికులు జరిపిన కాల్పులలో నేలకొరిగేవారు. వందమందికిపైగా యువకులు ఈ విధంగా మరణించారు. కశ్మీర్ లో ఏమి జరుగుతున్నదో తెలుగువారికి తెలియజెప్పాలనే ఉద్దేశంతో నేనూ, సహచరుడు జమీల్-ఉర్-రెహ్మాన్, కెమెరామన్ గిరితో కలిసి శ్రీనగర్ వెళ్ళాం. దళ్ లేక్ పైన

పదిహేను రోజులు బస చేశాం. హురియత్ నాయకులందరినీ ఇంటర్వ్యూ చేశాం. ఇటీవల కన్నుమూసిన వేర్పాటువాది గిలానీ అప్పుడు గృహనిర్బంధంలో ఉన్నారు. ఆయనను కలుసుకోవడానికి అనుమతి లేదు. పోలీసుల కళ్ళు కప్పి గిలానీ ఇంట్లో ప్రవేశించి. జయప్రదంగా ఆయనను ఇంటర్వ్యూ చేశాను. కశ్మీర్ లోయలో అన్ని పార్టీల నాయకులనూ ఇంటర్వ్యూ చేసిన తర్వాత శ్రీనగర్ విశ్వవిద్యాలయంలో కశ్మీర్ సమస్యపైన రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పాటు చేశాం. నాలుగేళ్ళ కిందట (జూన్ 2018) ఉగ్రవాదుల కాల్పుల్లో మరణించిన హిందూ మాజీ విలేఖరి, 'రైజింగ్ కశ్మీర్' పత్రిక సంపాదకుడు షుజాత్ బుఖారీ సహకారంతో చాలామంది ప్రొఫెసర్లూ, శ్రీనగర్ లోని మేధావులతో ఆ సమావేశంలో మాట్లాడించాం. కశ్మీర్ స్వతంత్ర్యం ప్రకటించుకున్న తర్వాత అత్యున్నత పురస్కారం బాలగోపాల్ కు ఇస్తామంటూ ఒక వక్త ఆ సమావేశంలో మాట్లాడాడు. శ్రీనగర్ లో అటువంటి సమావేశం అంతకు ముందు కానీ, ఆ తర్వాత కానీ జరగలేదు. హైదరాబాద్ కు తిరిగి వచ్చిన తర్వాత 'మండుతున్న మంచు కశ్మీర్' అనే శీర్షికతో నెలరోజుల పాటు రోజుకో గంట చొప్పున ఆ ఇంటర్వ్యూలను ప్రసారం చేశాం.

ఇటువంటి అవకాశాలు ఒక జర్నలిస్టుకు అరుదుగా వస్తాయి. సందర్భం వచ్చినప్పుడు స్వేచ్ఛ కలిగి ఉండటం, సహకరించే యాజమాన్యం, సహచరులూ ఉండటం నా అదృష్టం. ఈ కార్యక్రమాలు జయప్రదం కావడం వెనుక ఎంతోమంది సహకారం ఉంది. వారి పేర్లు రాసుకుంటూపోతే చాంతాడు అవుతుందని రాయలేదు. జర్నలిజం వృత్తిలో నాకు అభించిన అవకాశాలను ఒక్క సారి గుర్తు చేసుకుంటే ప్రజల పక్షాన నిలబడి పని చేసినందుకు, యాభై ఏళ్ళ కిందట బషీరుద్దీన్ జర్నలిజానికి చెప్పిన అర్థాన్ని సార్థకం

చేయగలిగినందుకు  కొంత సంతృప్తి కలుగుతుంది. ఏ సమయంలోనైనా, ఏ మీడియా సంస్థలోనైనా ప్రజలకు సమాచార సేవ చేసే అవకాశం కొద్దో గొప్పో ఉంటుంది. అవకాశాలను సద్వినియోగం చేసుకునే చొరవ, ధైర్యం, ప్రతిభ ఉండాలి. మనసుంటే మార్గం ఉంటుంది.

---- కొండుభట్ల రామచంద్రమూర్తి, జర్నలిస్టు, హైదరాబాద్

# 04. సమాజ గమనాన్ని గుర్తించాలి

--- లెనిన్ బాబు పెద్దింశెట్టి, అంగర, డా.బీఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లా,

సెల్: 9866664333

భుజాన సంచి, జేబులో పెన్ను, చేతిలో పుస్తకం, కళ్ళజోడు ధరించి సమస్యలపై ఆవేదనతో కూడిన ముఖ కవళికలతో ప్రతిక్షణం హడావిడిగా సంచరించే మంచి మనసున్న మనిషి జర్నలిస్టు... ఆదిమ సమాజం నుంచి ఆధునిక సమాజం వరకూ మానవ సమాజ స్థితిగతులు, రూపురేఖలపై అవగాహనతో వ్యవహరించే వ్యక్తి జర్నలిస్టు. ప్రతి పరిణామంపైనా క్షేత్ర స్థాయి సమాచారాన్ని సేకరించి, మస్తిష్క మథనంతో అక్షరీకరించే నిరంతర సమాచార చైతన్య స్రవంతి జర్నలిస్టు... ఇలా చెప్పుకుంటూ వెళ్ళితే సమాజంలో జర్నలిజానికి, జర్నలిస్టుకు ఉన్న ప్రాధాన్యత ఓ తరగని గనిని తలపిస్తుంది.

ఒకప్పుడు జర్నలిస్టు నీతి నిజాయతీలతో ఉండేవారని నేడు జర్నలిస్టులు ఎర్నలిస్టులుగా మారిపోయారన్న మాటలు వినిపిస్తుంటాయి. జర్నలిస్టులు మారిపోయారని, జర్నలిజం పక్కదారిపట్టిందంటూ చేసే వ్యాఖ్యానాలు వాస్తవంగా కనిపిస్తున్నప్పటికీ అందుకు గల కారణాలను జర్నలిస్టుల్లో కాకుండా సమాజంలో వెతకాల్సి ఉంది. వ్యక్తియొక్క మొత్తం వ్యక్తీకరణ మూలాలు సమాజంలోనే ఉంటాయి. మనిషి సమాజానికి ప్రభావితమయ్యే తన మనుగడను సాగిస్తుంటాడు. శ్రమే మానవ సమాజ గమనానికి మూలమని నమ్మే పత్రికలూ, జర్నలిస్టులో అనే మంది నేటికీ సమాజంలో ఉన్నారు. వారు నిబద్ధతతో, నిజాయతీగా వృత్తి నిర్వహణలో కొనసాగుతూ ఉన్నారు. వారికి భిన్నంగా ఉన్న పత్రికా సంస్థలు, జర్నలిస్టుల సంగతి ప్రస్తావించాల్సి వచ్చినప్పుడు వ్యక్తిగతంగా కాకుండా సమాజ పరిణామ క్రమంలోనే లోపాలను విశ్లేషించుకోవాల్సి ఉంది.

ఒకనాడున్న బానిస, భూస్వామ్య సమాజాల్లోని పరిస్థితులను నేటి ఆధునిక పెట్టుబడిదారీ సమాజంతో పోల్చి చూడటంలో శాస్త్రీయత ఉండాలి. గత కాలపు సమాజాల్లో అన్యాయం, దౌర్జన్యం, దోపిడి, వివక్ష చూపడాలన్నీ బహిరంగంగా జడలువిప్పుతూ ప్రదర్శితమయ్యేవి. వాటికి ప్రభావితమైన ప్రజల ప్రతిస్పందనా పోరాటాలు సైతం

బహిరంగాగానే కనిపించేవి. వాటిని జర్నలిస్టులు ప్రజలకు తమదైన శైలిలో తమ వార్తలు ద్వారా విశ్లేషించి చెప్పేవారు. వాస్తవాలను చెప్పే జర్నలిస్టులు, పత్రికలకు ఆ నాటి రోజుల్లో మంచి గౌరవం, విలువ పుష్కలంగా లభించేవి. కాలం మారింది.. నేడున్నది పెట్టుబడిదారీ సమాజమన్న విషయాన్ని సదా గుర్తించుకోవాలి. పెట్టుబడిదారీ సమాజంలో దోపిడి, దౌర్జన్యం, వివక్ష, అన్యాయాలన్నీ గత సమాజాలకన్నా అనేక రెట్లు అధికంగా సాగుతున్నాయి. కానీ దోపిడీదారుడు గత సమాజపు భూస్వామిలా కాకుండా సూటు,బూటు వేసుకుని చిరునవ్వుతో ఉంటూ ప్రజల ప్రయోజనాలకోసమే తాను వ్యాపారం చేస్తున్నానన్నట్టుగా వ్యవహరిస్తుంటాడు. పేదలచే గౌరవ, మర్యాదలను పొందుతుంటాడు. పైగా ఆ దోపిడీదారుడైన పెట్టుబడిదారున్ని సాధారణ ప్రజలు దేవుడిలా కీర్తిస్తుంటారు. కాని నిజానికి ఆ పెట్టుబడిదారులు గత కాలపు భూస్వాములకంటే ప్రమాదకరమైన వారు. సరుకులను అమ్ముకుంటూ లాభం రూపంలో దోపిడి చేస్తుంటారు.

పెట్టుబడిదారుడు తయారు చేసే సరుకుల్లో అనేకమైన సరుకులు మానవ జీవనానికి ఏ మాత్రమూ అవసరం కానివి. ఆ సరుకు నీ చేతిలో లేకపోతే నీది అసలు మానవ జన్మేకాదు అన్న తరహాలో సామాన్య మనిషి మెదడును తన ప్రచార మాధ్యమాల ప్రకటనలు ద్వారా దొలిచేలా చేస్తుంటాడు. మనిషి చేతిలో ఐ ఫోన్ ఉంటే మనిషి ద్వారా ఆ సెల్ ఫోన్ కు విలువ పెరగడం సహజంగా భావించాలి. కానీ ఐఫోన్ కలిగిన మనిషి గొప్పవాడంటూ సరుకును బట్టిన మనిషికి విలువను ఆపాదిస్తున్నారు. కారు, బైక్ ఇలా సరుకులు మనిషి విలువకు కొలమానాలుగా ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ మార్చేసింది. సరుకులు ఆకర్షణీయమైనవిగా ఉంటాయి. తిండి సంగతి ఎలా ఉన్నా మార్కెట్ లో సరుకులు కొనడం తప్పదుకదా అన్న భావనలోకి ప్రజలను నెట్టుతాడు. అలా సరుకుల వలతో ప్రజల వద్ద ఉన్న ఆదాయ వనరులన్నింటినీ కరిగించి తన కుటుంభ ఆస్తుల్లోకి చేర్చుకుంటాడు. ఈ దుర్మార్గమైన వ్యాపార ధోరణులే నేటి దోపిడీ సాధనమని ప్రజలకు అర్ధమయ్యేట్టు చెప్పడంలో జర్నలిజం ఏమైనా కృషి చేస్తున్నదా అన్న ప్రశ్న ప్రతి ఒక్కరూ వేసుకోవాలి. సరుకుల యావలో పడిన అల్ప ఆదాయ ప్రజలు తమ కొద్దిపాటి ఆదాయాన్ని మార్కెట్లో కోల్పోతారు. మంచి చెడ్డలన్నింటినీ ఆ సరుకుల్లోనే

చూసుకొంటుండటంతో ఇతర మనుషులతో తెగతెంపులు చేసుకుని జీవిస్తున్నట్టు పరాయికరణతో మనిషి బతుకుతున్నాడు.

ఈ తరహా వ్యవహారాలను దోపిడిగా జర్నలిజం గుర్తించగలుగుతున్నదా అన్నది ఆలోచన చేయాలి. మార్కెట్ తరహా దోపిడీని జర్నలిజం గుర్తించని పక్షంలో సమాజంలో పెచ్చుమీరుతున్న తీరుతెన్నుల్లో జర్నలిస్టులు సైతం ప్రభావితం కాక తప్పని పరిస్థితి. జర్నలిస్టులు ఎర్నలిస్టులుగా మారుతుండటమూ ఈ కోవకే చెందుతుంది. పత్రికా సంస్థల పెట్టుబడి దోపిడీ చేయగా సమకూరినదైతే అనివార్యంగా పత్రికా నిర్వహణ, సమాచార సేకరణ, వార్తా ప్రచురణ, జర్నలిస్టుల బాగోగులు అన్ని దోపిడీ ప్రభావితమైపోతాయి. జర్నలిజంలోని గతకాలపు విలువ కలిగిన వార్తలూ, విలువలుగల జర్నలిస్టులనూ నేటి పెట్టుబడిదారీ సమాజపు పత్రికా సంస్థల్లో చూడలేము. పత్రిక స్థాపన, ఉద్యోగుల కూర్పు, వార్తా సేకరణ, వార్తా ప్రచురణ ఇలా అన్నింటి వెనుకా ప్రజా ప్రయోజనాన్ని ఆశించలేమని గుర్తించాలి. ఈ క్రమంలో ఏ ఒక్క వ్యక్తినో తప్పుబట్టలేము. అవన్నీ పెట్టుబడిదారీ సమాజపు అవలక్షణాలు. సమాజ మార్పుకోసం కృషి చేయడమే జర్నలిజం విలువల పరిరక్షణ సైతం సాధ్యపడుతుంది. సమాజ మార్పును ప్రస్తావించకుండా జర్నలిజం మెరుగుదలకోసం మాట్లాడుకోవడమంటే గుడ్డిలో మెల్ల అనుకునే ప్రయోజనాలను మాత్రమే పొందగలుగుతారు. లాభాపేక్ష, రాజకీయ కాంక్ష, వ్యక్తిగత ఆస్తుల రక్షణే ధ్యేయంగా అధికశాతం పత్రికలు నడుస్తున్న నేటి పెట్టుబడిదారీ సమాజంలో జర్నలిస్టుగా బతుకుతున్న వ్యక్తి సమాజ మార్పుకోసం అడుగులు వేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అదే అన్నింటికీ పరిష్కారం కాగలదు.

**------ లెనిన్ బాబు పెద్దింశెట్టి, అంగర, డా.బీఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లా,**

**సెల్: 9866664333**

# 05. ప్రజాగొంతు మ్యూట్ లో ఉంది - మూగబోలేదు

--- మాకా రాజేందర్, సామాజిక కార్యకర్త, రావులపాలెం

ఏ మహానుభావుడు నిర్వచించాడో తెలియదు గానీ, ఈ మధ్య సామాజిక మాధ్యమాల్లో పత్రికల స్వభావాన్ని, పాత్రికేయ విలువల్ని అత్యంత స్పష్టంగా విపులీకరించే రెండే రెండు లైన్ల సూక్తినొకదాన్ని రూపొందించాడు. అది -

'నాటి పత్రికలు ముద్రించబడి అమ్ముడుపోయేవి,

నేటి పత్రికలు అమ్ముడుపోయి, ముద్రించబడుతున్నాయి'* అనంటూ. ఈ చిన్న వాక్యం పత్రికల రూపాన్ని మాత్రమే కాక, పాత్రికేయుల, ప్రచురణ కర్తల స్వరూప స్వభావాలను విడమర్చి చెబుతుంది. ఈ విపరిణామం ఒక్క ముద్రణా రంగంలో ఉన్న పత్రికలకు మాత్రమే కాక, ప్రసారమధ్యమాలైన టీవీలకు; మరియు నేడు ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొస్తున్న యూట్యూబ్ ఛానళ్ళు లాంటి సామాజిక మాధ్యమాలకూ వర్తిస్తుంది. ఈ విపరిణామం అప్పటికప్పుడు సంభవించినది కూడా కాదు, కాలానుగుణంగా జరిగిన మార్పులు కూడా ఈ మార్పుకు కారణమే.

ఎందుకు ఇంత తీవ్రమైన మార్పు సంభవించింది? ఈ వైపరీత్యానికి దారి తీసిన కారణాలు, కారకాలను తర్కిస్తే ఈ ప్రశ్నకు జవాబు దొరుకుతుంది. పత్రికల పుట్టుక, పోకడ విషయంలో విశ్వవ్యాప్తంగా జరిగిన పరిణామాలతో నాకు పరిచయం లేదు గానీ; రాచరిక సమాజం నుండి ప్రజాస్వామ్య సమాజంగా - ఇండియా సమాజం రూపాంతరం చెందుతూ వచ్చిన కాలం నుండి గమనిస్తే - పత్రికల పుట్టుక ఓ ఉన్నతమైన ఆశయం కోసం జరిగేది. ఏ ఆశయం కొసమైతే అట్టి పత్రికలు నడుం కట్టేవో, ఆ ఆశయ సాధన పూర్తయ్యే వరకు అవి అవిశ్రాంతంగా పనిజేసేవి. అనేక మంది మహానుభావులు చేపట్టిన

అట్టి నమూనాలు చాలా మందికి తెలిసినవే కాబట్టి  నేనిక్కడ మళ్ళీ ప్రస్తావించను. అప్పట్లో సామాజిక, రాజకీయ సంస్కర్తలు సమాజంలో జరుగుతున్న అన్యాయాలను, అకృత్యాలను అసమానతలను ఎలుగెత్తి చూపటం ద్వారా ప్రజా చైతన్యాన్ని రగిలిస్తూ అట్టి సామాజిక దౌష్ట్యాన్ని నిలువరింప జూసేవారు. అలా వచ్చిన ప్రజా చైతన్యాన్ని ఓ ప్రజా ఉద్యమంగా మరల్చేందుకు తదనంతర కాలంలో కూడా ఆ ప్రజా ఉద్యమం దీర్ఘ కాలం నిలబట్టేందుకు పత్రికలను ఓ మాధ్యమంగా ఉపయోగించేవారు.  సూక్ష్మంగా చెప్పాలంటే 'పత్రికలు ప్రజాపక్షపాతులు'గా మెలిగేవి. అందుకే అవి - శాసన నిర్మాణ, కార్యనిర్వహణ, న్యాయ శాఖల సరసన జేరి; 'రాజ్య నిర్మాణానికి నాలుగో స్తంభం' (fourth estate) గా గుర్తింపు తెచ్చుకోగలిగాయి. కొంతకాలం ఈ పత్రికలు కాస్తో కూస్తో నిష్పాక్షిక సేవలు అందించినప్పటికీ, రాన్రాను కాలాను'గుణం'గా వచ్చిన మార్పుల వల్ల తమ ప్రతిష్టను మసకబార్చుకొన్నాయి. అందుకే 1980 దశకం లోనే -  అనగా భారతానికి స్వాతంత్రం వచ్చిందని చెప్పబడుతున్న దాదాపు 35 ఏళ్లకే ఈ పత్రికల దుష్ట స్వభావాన్ని తెలుపుతూ శ్రీశ్రీ "పెట్టుబడి దారుల విష పుత్రికలీ పత్రికలు" అని తీవ్రంగా ఈసడించాడు.

మనకు సాధారణంగా సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, వినోద విషయాలపై వార్తలను విశ్లేషణలను అందించే పత్రికలు విడి విడిగా ఉండేవి, ఇప్పటికీ కొన్ని ఉన్నాయి. అవి దిన, వార, పక్ష, మాస ఇత్యాది కాలిక పత్రికలుగా వెలువడుతూ ఉంటాయి. అయితే కాలాను'గుణం'గా వచ్చిన మార్పులతో మిగతా కాలిక పత్రికలు కాస్త వెనకబడిపోగా; దినపత్రికలకు మాత్రం అంతో ఇంతో ప్రజాదరణ లభించింది. దానికి కూడా కారణం -

పాఠకులకు అప్పటికి దిన పత్రికలను చదవటం ఓ వ్యసనంగా మారడమే! గ్లోబలైజేషన్లో బాగంగా సామజికార్ధిక రాజకీయ రంగాల్లో సంభవించిన మార్పుల వల్ల ముద్రణా రంగంలో వచ్చిన మార్పుల వల్ల ఫ్రోటో టైప్ యంత్రాల ప్రవేశంతో పత్రికా నిర్వహణ మరింత భారమై అనేక దిన, వార, పక్ష పత్రికల ప్రచురణ, నిర్వహణ దాదాపు ఆగిపోయింది.

ఎవరైతే భారీగా పెట్టుబడి పెట్టగలరో అట్టి వారి పత్రికలే నిలబడ్డాయి. వారి నియంతృత్వమే కొనసాగుతూ వచ్చింది, వస్తోంది. ఈ పరిణామం తర్వాత, ఈ నియంతృత్వ పెట్టుబడిదారుల పత్రికలు పాత్రికేయ రంగంలో పక్కా వ్యాపార, లాభార్జన ధోరణి జొప్పించాయి. భారత స్వతంత్ర సంగ్రామం నాడే ఈ వ్యాపార ధోరణి మొదలైందని బాబాసాహెబ్ అంబేద్కర్ మాటల్లో మనకర్థం అవుతుంది. బహిష్కృత భారత్, ప్రభుద్ద భారత్, మూక్ నాయక్ వంటి ప్రజా ప్రయోజన పత్రికలు నడిపిన ఆయన ఒక చోట - "భారతదేశంలో జర్నలిజం ఒకనాడు వృత్తి, నేడది వ్యాపారం (Journalism in India was once a profession. It has now become a trade)" అంటారు. దాని ఫలితంగా సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, వ్యాపార, వినోద ఆధ్యాత్మిక శీర్షికలన్నింటినీ ఒకే దిన పత్రికలో చొప్పిస్తూ; అయా ప్రత్యేక రంగాల్లో పనిచేసే నిమిత్తం నెలకొల్పబడ్డ పత్రికలన్నీ మూతబడేట్టు చేశాయి.

1990వ దశకం తర్వాత వేగవంతమైన సామాజిక రాజకీయ పరిస్థితులను తమకనుకూలంగా మార్చుకొనుటకున్ను, తమ రాజకీయాధికారంను స్థిరపర్చుకొనుటకున్ను ఈ నియంతృత్వ దిన పత్రికలు ఓ క్రమపద్ధతితో ప్రజా ఉద్యమాలను కట్టడి చేయుటకు ప్రయత్నించి గొప్ప విజయం సాధించాయి. అప్పటి వరకు పత్రికల ద్వారా అతి విస్తృత ప్రదేశాలకు

చేరుతున్న ప్రజా ఉద్యమ వార్తలను జిల్లా ఎడిషన్లు, నియోజకవర్గ ఎడిషన్లు ప్రారంభించుట ద్వారా కట్టడి చేసేశారు. పొరుగు జిల్లా, పొరుగు నియోజకవర్గ వార్తలు పక్క ఊరోడికి కూడా తెలియకుండా జేసి, తద్వారా ప్రజా ఉద్యమ విస్తృతిని అరికట్టగలిగారు. దీనితో పాటు - రాజకీయాల్లో వ్యాపార దృక్పథం ఎప్పుడైతే బలపడిందో అప్పుడే; రాజకీయాధికారం మరొక సామాజిక వర్గానికి దక్కకూడదన్న దుష్ట తలంపు పత్రికలను కరపత్రికల స్థాయికి దిగజార్చి, అసలు వార్తలను మరుగుపరచి, నకిలీ వార్తలను ప్రచురించటం, 'వంట వార్తలను' వడ్డించటం మొదలెట్టారు. అప్పటి నుండే పత్రికలు 'ముందుగానే అమ్ముడయిపోయి తర్వాత ప్రచురించబడుతున్నాయి'. ఈ విధానం కేవలం పత్రికలకు మాత్రమే కాదు, ప్రసార మాధ్యమాలకు, నేడు ఇబ్బడి ముబ్బడిగా ప్రజా పాత్రికేయం పేరున పుట్టుకొస్తున్న యూట్యూబ్ చానళ్లకు కూడా వర్తిస్తుంది.

ఈ పరిణామాలతో ఒక వైపు సామాజిక ప్రజా ఉద్యమాలు చల్లబడిపోగా; రాజకీయ ఉద్యమాలు పక్క దారి పట్టించబడ్డాయి. ఈలోగా గ్లోబలైజేషన్ ప్రభావం వల్ల కెరీరిజం బలపడి; ప్రజల్లో 'తిరుగుబాటు స్వభావానికి బదులు జరుగుబాటు స్వభావం బలంగా పెరగటం' వల్ల ఉద్యమించే స్వభావం కొండెక్కింది.

ఇప్పుడు ఒక ప్రధాన ప్రశ్న ప్రజా ఉద్యమసంస్థలు, అభిలాషుల ముందుకొస్తుంది. ప్రజల్లో ఉద్యమ స్వభావమే నశించిపోయినపుడు పత్రికలతో పనేముంది? ఒక సామాజిక ఉద్యమమయినా, రాజకీయ ఉద్యమమయినా, లేక ఆధ్యాత్మిక ఉద్యమమయినా ప్రచారం ద్వారానే విస్తృతి చెందుతాయి. ఆ ప్రచారానికి పత్రికలు మాధ్యమంగా పంజేస్తాయి. అందుకే బాబాసాహెబ్

అంబేడ్కర్ మరొక సందర్భంలో "ప్రజా ఉద్యమం లేని పత్రిక రెక్కలు లేని పక్షి లాంటిది" అని చెబుతూనే; "ప్రజా ఉద్యమం లేని పత్రిక, పత్రిక లేని ప్రజా ఉద్యమం మనజాలవు" ఉద్బోధిస్తారు.

దీనిని బట్టి ఇప్పుడు ప్రజా ఉద్యమ కారుల ముందు రెండు పనులున్నాయనేది అర్థమవుతుంది. ఆ రెండు పనులూ సున్నా స్థాయి నుండి మొదలెట్టవలసినవే. ఒకటి - సమకాలీన పరిస్థితులకు తగ్గట్టు ప్రజా ఉద్యమాలు నిర్మించటం. అనగా గ్లోబలైజేషన్ ప్రభావం వల్ల ప్రజల వృత్తి వ్యాపాకాల్లో, రాబడి, ఖర్చుల విధానాల్లో అనూహ్య మార్పులు సంభవించాయి. గతంలో ఉన్నట్టు అవ్యవస్థీకృత రంగంలో వ్యవసాయ కూలీలు, రైతులు; వ్యవస్థీకృత రంగంలో పెట్టుబడిదారులు, కార్మికులు - ఇలా రెండు మూడు ట్రేడ్లు మాత్రమే కాక; వృత్తుల్లో - సెక్యూరిటీ గార్డులు, భవననిర్మాణ కార్మికులు (దానిలో మళ్ళీ ఆరేడు రకాల ఉప వృత్తులు), డ్రైవర్లు, క్లీనర్లు, సాఫ్ట్వేర్ కు అనుబంధంగా ఉన్న సాంకేతిక పనివారు, స్వయం ఉపాధి పొందే వారు - ఇలా అనేక రకాలైన మార్పులు వృత్తుల్లో ఏర్పడ్డాయి. అలాగే రాబడి పెరిగినప్పటికీ ప్రజల్లో అనుత్పాదక ఖర్చు పెరిగిపోయింది. ఇదివరకటిలా అమ్మకందార్ల దోపిడీ ప్రత్యక్షం గా కనబడదు. అది బాధాకరంగా కూడా అనిపించదు. మద్యంపై ఖర్చు, శుభ, అశుభ కార్యక్రమాలకు అనవసర బడాయి ఖర్చు, మోటార్ సైకిళ్ల కొనుగోళ్లు, సెల్ ఫోన్ల పై ఖర్చు తదితరాల వల్ల కొనుగోలుదారే స్వయంగా ఐచ్చిక దోపిడీకి గురి కాగల అనవసర వినియోగ విధానం ప్రజల్లో అలవడింది. ఈ వినియోగవాద విధానానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యం చేయాలి. మరో వైపు రాజకీయపార్టీలు అన్నీ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీలుగా మారి; ప్రజా శ్రేయస్సు కోసం కాక; లాభార్జనకు స్వార్థపరులు రాజకీయ రంగాన్ని

ఆశ్రయించటం జరుగుతుంది. ఇందువల్ల సామాన్య ప్రజలు మరింత సున్నిత దోపిడీకి గురవుతున్నారు. ఇదే రాజకీయ రంగం పరోక్షంగా ప్రేరేపిస్తున్న కుల చైతన్యం అల్ప సంఖ్యాక వర్గాల్లో ఆందోళనలకు ప్రేరేపిస్తున్నాయి. వీటన్నింటి పైనను ప్రజా ఉద్యమాలు నిర్మించబడాలి.

ప్రజా చైతన్య సంఘాలు, వ్యక్తులు చేయాల్సిన రెండవ పని - ఈ మారిన పరిస్థితులన్నింటిని విస్తృతంగా ప్రచారం చేయుటకు వలయు మాధ్యమాలను తయారు చేసుకోవటం. మారిన సమకాలీన పరిస్థితుల వల్లనేమి, సైద్ధాంతిక రాద్ధాంతాల వల్లనేమి చీలికలు పీలికలు అయిపోయిన ప్రజా సంఘాలు పునర్నిర్మించబడి, లేదా పునః ప్రారంభం కాబడి; ప్రచార, ప్రసార సాధనాల ద్వారా ప్రజా ఉద్యమాలు తిరిగి సున్నా స్థాయి నుండి నిర్మించబడాలి. ఇది ప్రస్తుతమున్న పరిస్థితుల్లో అత్యంత క్లిష్టమైన, కష్టమైన పనియే. కానీ తప్పదు. ప్రత్యామ్నాయ ప్రజా ఉద్యమాలూ నిర్మించబడాలి, వాటిని ప్రమోట్ చేసుకొనేందుకు ప్రత్యామ్నాయ పత్రికలు ప్రారంభించబడాలి.అందుకోసం అభ్యుదయ వాదులు, శ్రామిక, కర్షక శ్రేయోవాదులు చొరవ చూపాల్సిందే!

---- మాకా రాజేంద్రన్, సామాజిక కార్యకర్త, 91 94 9151 8909, 91 9966 306 555.

# 06. సోషల్ మీడియాపై అవగాహన అవసరం

కలంధర్, రాయలసీమ మహాసభ కన్వీనర్, జర్నలిస్టు, ప్రొద్దుటూరు.

నేడు, కొన్ని నియమనిబంధనలకు లోబడి, ఎవరైనా జీమెయిల్ ద్వారా కంప్యూటర్ లేదా ల్యాప్టాప్ ద్వారాగానీ లేదా కేవలం, చేతిలో ఒక సెల్ఫోన్ ఉంటేచాలు, యూట్యూబ్ ఛానల్ని ఏర్పాటుచేసుకోవచ్చు. అందులో వారివారి భావజాలాన్ని బట్టి, ఎంటర్ టైన్మెంట్లకు గానీ, వార్తలకు సంబంధించిన విషయాలకుగాకి ప్రసారం సులువుగా చేసుకునే వెసలుబాటు లభిస్తూ ఉండడంతో, యూట్యూబ్ ఛానళ్లు కుప్పలు తెప్పలుగా రోజూ వచ్చిపడుతున్నాయి. పెయిడెడ్ యూట్యూబ్ ఛానళ్లకు, పెద్దపెద్ద యూట్యూబ్ ఛానళ్లకు లక్షలమంది సబ్ స్క్రైబర్లు ఉంటూ, వాటిని లక్షలబంది ఆదరిస్తూ వుండడం వల్ల, వారికి మంచి ఆదాయమే వస్తోంది! ఇక డబ్బులు సంపాదించుకునేందుకై యూట్యూబ్ ఛానళ్లు ఓ వేదిక కావడంతో, అనేకమంది యూట్యూబ్ ఛానళ్లను ఏర్పాటు చేసుకుంటున్నారు. అయితే, వాటికి సరియైన ఆదాయం రాకపోవడంతో, అధిక సమయాన్ని వెచ్చించి ప్రోగ్రాంలను తీసుకోవాల్సి రావడంతో, చాలామంది  నిరాశతో వీటికి మధ్యలోనే వదిలేస్తున్నారు. ఇలా కొన్ని ఛానళ్లే అభివృద్ధి చెందుతూ ముందుకు కదులుతున్నాయి. ఔత్సాహికులు కొందరు, కేవలం ఒక ఛానల్లోనే సంతృప్తి చెందక, రకరకాల పేర్లతో, రకరకాల ఛానళ్లు నడుపుతున్నారు. వెల్లువలా రోజూ సరికొత్తగా వచ్చిపడుతున్న యూట్యూబ్ ఛానళ్ల తాకిడికి తట్టుకునేందుకై, యూట్యూబ్ యాజమాన్యం వారు, రోజురోజుకూ ఒక కొత్త నిబంధనను పెడుతూ, కొత్త యూట్యూబ్ చానళ్ల ముక్కులకు మూకుతాడువేస్తున్నారు. నియంత్రిస్తున్నారు . ఒక యూట్యూబ్ ఛానల్ కు  గుర్తింపు రావాలంటే, ఒక

సంవత్సరపు లోపుగా, యూట్యూబ్ నియమనిబంధనలను అనుసరించే వాటినన్నింటినీ పూర్తిచేయల్సి వుంటుంది. సంఖ్య, సబ్ స్క్రైబర్ల సంఖ్యను ,వీక్షించిన సమయాన్ని లెక్కించాకే, ఆ చానల్ కు మానిటైజేషన్ లభిస్తుంది. ఈ మానిటైజ్ అయిన తర్వాతే, ఆ ఛానల్ కు రెవిన్యూ వస్తుంది. ఒక యూట్యూబ్ ఛానల్ మానిటైజ్ కావడమంటే, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న యూట్యూబ్ వ్యవస్థ, వారిని పార్ట్నర్స్ గా స్వీకరించినట్లే లెక్క! యూ ట్యూబ్ లో ప్రసారం చేసే సమాచారానికి గానీ, వార్తలకు గానీ ప్రత్యేక నియమ నిబంధనలు ఉంటాయి. ఈ నియమ నిబంధనలు, ఆయా దేశాల రాజకీయ, సార్వభౌమాధికార పరిధిని బట్టి ఉంటాయి. వాస్తవంగా చెప్పాలంటే ప్రస్తుతం యూట్యూబ్ నియమ నిబంధనలు చాలా కఠినంగా ఉన్నాయి. కాపీరైటుకు సంబంధించిన స్ట్రయిక్స్ మూడు వస్తే, ఇక ఆ ఛానల్ టర్మినేట్ చేయబడుతుంది. ఇవేగాక యూట్యూబ్ మనుగడకు అనేక ప్రమాదాలు పొంచేవుంటాయి. ఎదిగిన యూట్యూబ్ ఛానళ్లకు అడుగడుగునా హ్యాకర్స్ వల్ల చాలా పెద్ద ప్రమాదమే పొంచివుంటుంది కూడా! అలా హ్యాక్ కాబడకుండా తగిన యాప్స్ ఉపయోగించుకోవాల్సివుంటుంది. ఇలాంటి ప్రమాదాల బారిన పడకుండా వుండేందుకై పెద్ద పెద్ద యూట్యూబ్ ఛానళ్ల యాజమాన్యాలు భారీ మూల్యాన్ని కూడా చెల్లిస్తుంటారు .

పెద్దపెద్ద యూట్యూబ్ న్యూస్ ఛానల్స్ లో పనిచేసే రిపోర్టర్ లకు ప్రభుత్వ అనుమతులకు సంబంధించిన అక్రిడియేషన్స్ సులువుగానే మంజూరు చేయబడతాయి. కానీ, సాధారణ యూట్యూబ్ న్యూస్ ఛానళ్లకు ఈ పరిస్థితి వుండదు. కనుక , అక్రిడియేషన్స్ లభించవు. లభించవు అనీ అవడంకంటే, ఇవ్వరనడమే సబబుగా ఉంటుందేమో! ఈ అక్రిడియేషన్స్ లేవనే సాకుని

చూపించే, ప్రభుత్వ సంబంధిత కార్యక్రమాలలో పాల్గొనేందుకై వీరికి అనుమతులు లభించడం లేదు.

సాధారణంగా ఏదైనా ఒక వార్త ఎలెక్ట్రానిక్ మీడియాలలో, అంటే, ప్రధాన ఛానళ్లలో ప్రసారం జరగాలంటే కొంత సమయం పడుతుంది. ఆ వార్తకున్న ప్రాధాన్యతను బట్టి ,దానిని ప్రసారం చేస్తారేగానీ అన్నింటినీ చేయరు. అందులోనూ ఓ అరనిమిషమో, ఒక నిమిషమో మాత్రమే ప్రసారం చేస్తారు. వారివారి ప్రియార్టీస్ వారికి ఉండనే ఉంటాయి. ఎలెక్ట్రానిక్ పీడియా చాలా బలమైన మాధ్యమం, అయితే, లోకల్ న్యూస్ కు ప్రాధాన్యత రావాలంటే, లోకల్ యూట్యూబ్స్ పనిచేసినంత వేగంగా , ఈ ఛానల్స్ పనిచేయలేవు. అత్యంత వేగంగా ఏదైనా సమాచారాన్ని యూట్యూబర్స్ ఇట్టే ప్రసారం చేయగలరు . అంతేగాక, నిడివి విషయంలోనూ ఎక్కువ సమయాన్ని, అవసరమైతే పొడిగించగలవు కూడా! మంచి రిపోర్టర్ లయితే, మంచి వ్యాఖ్యానాన్ని కూడా జోడించగలరు. ప్రతిభావంతులైతే, విమర్శలు కూడా చేయగలరు. ఇంటర్వ్యూలను, రాజకీయ విశ్లేషణలకు సరియైన వేదిక, యూట్యూబేననడంలో ఎలాంటి సంశయం ఉండాల్సిన అవసరం లేదు. ఒక వార్తాదినపత్రికలో ఒక వార్త ప్రచురించబడాలంటే, అది ఎన్న కోతలకు గురికావల్సిందే. అందులోనూ ఆ వార్త అదేరోజు వెలువడదు, మరుసటి రోజు న మాత్రమే ప్రచురింపబడుతుంది. వేగవంతమైన జీవితంలో వార్తల ప్రసారం కూడా వేగంగా జరిగితేనే దానికి ప్రాముఖ్యత పెరుగుతుంది. ఈ నేపధ్యం ఒక యూట్యూబ్ చానల్స్ కే వుంది.

ఎలెక్ట్రానిక్ మీడియాకు సంబంధించిన రిపోర్టర్స్ కు,యూట్యూబ్ రిపోర్టర్స్ కు ఎందుకు పడదంటే- యూట్యూబ్ న్యూస్ కు డిమాండ్ రావడం వారికి గిట్టని అంశం. అదీగాక, యూట్యూబ్ న్యూస్ కు పెరిగిన ఆదరణవల్ల, వాళ్ల మనుగడే ఓ ప్రశ్నార్థం కావడం!

**---- కలంధర్, రాయలసీమ మహాసభ కన్వీనర్, జర్నలిస్టు, ప్రొద్దుటూరు.**

# 07. సమాచారాన్ని  అర్థం చేసుకోవడం ఎలా?

- అనిశెట్టి సాయికుమార్, జర్నలిస్టు

ఎక్కువమంది ప్రజానీకాన్ని వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ ప్రభావితం చేసే భావ ప్రకటన, ప్రసారాలను సమాచార మాధ్యమాలుగా చెప్పుకోవచ్చు. నలబై యాబై ఏళ్లక్రితంవరకూ రేడియో, దినపత్రికలు, సినిమాహాళ్లలో ప్రదర్శించే ప్రభుత్వ డాక్యుమెంటరీలు, కొన్ని ఇతర ప్రచురణలవంటివి ఉండేవి. రహస్య కరపత్రాలు, ప్రచురణలవంటి యధాతధ స్థితిని ధిక్కరించే ప్రత్యామ్నాయ మార్గాలు పూర్వకాలంలో కూడా ఉన్నప్పటికీ వాటి ప్రభావం, పరిమితి చాలా తక్కువ స్థాయిలో లెక్కించదగిన విధంగా ఉండేది. వర్తమానంలో, సమాచార సాంకేతిక విప్లవ ఫలితంగా ప్రధాన సమాచార స్రవంతితోబాటు ప్రత్యామ్నాయ సమాచార ప్రసార మాధ్యమాలు ఉనికిలోకివచ్చాయి. పెద్ద దినపత్రికలు, వార్తాపత్రికలు, వివిధ టీవీ ఛానళ్ళు, ప్రకటనలుండే హోర్డింగులవంటివాటిని ప్రధాన స్రవంతి ప్రసార, ప్రచార మాధ్యమాలుగా చెప్పుకోవచ్చు. ప్రధాన స్రవంతి ప్రసార, ప్రచార మాధ్యమాలలో మనకు కావలసినదానికంటే చాలా ఎక్కువ సమాచారం మనమెదళ్ళలోకి ఎక్కిస్తూ ఉంటారు. ఇవన్నీ చాలా ప్రజాస్వామ్యయుతంగా, నిష్పక్షపాతంగా ఉన్నట్లుగా తమరూపం ప్రదర్శిస్తుంటాయి. లాభాలే వాటి అంతిమ ప్రయోజనం కాబట్టి, తమకు ప్రకటనలద్వారా లాభాలు తెచ్చిపెట్టే కార్పొరేట్ వ్యవస్థలకుతొత్తుల్లావినియోగ సంస్కృతిని పెంపొందించే విధంగా  పనిచేయడం సహజం. ఇవన్నీ తాము అందించే సమాచారంతో ప్రజానీకపు మెదళ్ళను వస్తువినిమయ సంస్కృతితో ముంచెత్తుతున్నాయి. రాజకీయాలు, కార్పొరేట్ రంగమూ చెట్టపట్టాలేసుకుని తిరుగుతున్న వర్తమానంలో, ప్రధాన స్రవంతి

మాధ్యమాలలో దాదాపుగా అన్నీ ఏదో ఒక అధికార, ప్రతిపక్ష రాజకీయ పార్టీ తరపున నిత్యం ప్రజల మెదళ్ళను ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. ఇటువంటి వర్తమానంలో, ప్రత్యామ్నాయ సమాచార మాధ్యమాలు తమ ప్రాపంచిక దృక్పధంతో కూడిన ఆలోచనలు, భావాలు వినిపించడంద్వారా ప్రజలు హేతుబద్ధంగా మంచి చెడులను తర్కించుకోవడానికి, స్వయంగా ఒక అభిప్రాయం ఏర్పరచుకొనే నిర్ణయాన్ని తీసుకోవడానికీ ఆస్కారం కల్పిస్తున్నాయి.

సాంకేతిక విప్లవం ఫలితంగా అనివార్యంగా ప్రజలకు చేరువైన స్మార్ట్ ఫోన్లు, తేలికగా, చౌకగా లభ్యమయే అంతర్జాల సౌకర్యం అందరూ అక్కున చేర్చుకుంటున్న ఈదశలో, ఫేస్ బుక్, టెలిగ్రామ్, వాట్సాప్ గ్రూపులు, ట్విట్టర్ వంటి వాటిద్వారా సమాచారం విస్తృతంగా ప్రజలకు చేరువ అవుతోంది. అంతేకాకుండా, భిన్న భావజాలమున్న వ్యక్తులు నడిపే అనేక రకాల అంతర్జాల పత్రికలు, వెబ్ సైట్లద్వారా కూడా ప్రత్యామ్నాయ సమాచారం ప్రజలకు చేరువ అవుతోంది. వర్తమానంలో దీని ప్రభావం ఎంత ఎక్కువగా ఉందంటే, ప్రధాన స్రవంతి ప్రచురణ, ప్రసార మాధ్యమాలు సైతం అంతర్జాల మార్గాన్ని ఉపయోగించకొక తప్పని పరిస్థితులు వచ్చాయి. ఫలితంగా ప్రధాన స్రవంతి పత్రికలు, తెలివిజన్ లు మొబైల్ ఎడిషన్లు తెచ్చాయి. స్మార్ట్ ఫోన్ లను దృష్టిలో ఉంచుకొని అనేక కొత్త ఛానళ్ళు వచ్చాయి. మోజో టీవి, మొబైల్ జర్నలిజం అనే కొత్త పదాలు నిఘంటువులకెక్కాయి.

ప్రధాన స్రవంతి మాధ్యమాలన్నిటా పైడ్ జర్నలిజం పేరిట వండి వార్చిన వార్తల్ని అమ్ముకోవడం జరుగుతోంది. ఇందుకై ఆయా ప్రచురణ, ప్రసార మాధ్యమాలు తమ స్టింగర్లు, వార్తలు అందించేవారిపై విపరీతంగా వత్తిడి తేవడం

కనబడుతోంది. తమకు జీతాలు ఇవ్వడం కుదరదనీ, తామూ సంపాదించుకొని, సంస్థకూ ఆదాయం చేకూర్చాలని ఒత్తిడి పెట్టే సంస్థలూ ఉన్నాయి. దీంతో జర్నలిజం కాస్తా ఎర్నలిజంగా మారిన పరిస్థితులు వచ్చాయి. జర్నలిష్టులుకనుమరుగై "ఎర్నలిష్టులు"మాత్రమే మిగిలే పరిస్తితి వచ్చింది. ఈ పైడ్ జర్నలిజం పద్ధతిలో ఒక వ్యాపారఉత్పత్తిగొప్పదనాన్న ప్రత్యక్షంగాగానీ పరోక్షంగాగానీ పొగడడం, ఒక బాబా, స్వామి మహిమలు ప్రచారంచేయడం చేయడం,ధార్మిక మతసంస్థ నిర్వర్తించేకార్యక్రమాలకు విస్తృత ప్రచారం కల్పించడంవంటివి ఉన్నాయి. వర్తమానంలో ఈపద్ధతి బాగా పెరిగిపోయింది. ఇక ఎన్నికలు జరిగే సమయాల్లో అధికారంలో ఉన్న పార్టీకి అనుకూలంగా అన్నీప్రధాన స్రవంతి ప్రసార ప్రచురణమాధ్యమాల్నీ తమకు అనుకూలంగా ప్రధానవార్తలు రాయించడం అన్నీచోట్లా కనబడుతోంది. సామాజిక మద్దతు గానీ, వ్యాపార ప్రచారం గానీ అవసరమైన సందర్భంలో, లేదా ఎన్నికలలో పోటీ చేసే అభ్యర్థి వ్యక్తిత్వాన్ని ఆకాశానికి ఎత్తేయడంవంటివి ఈ పద్ధతిలో సాధారణ అంశాలుగా మారేయి. ఇక వారు చెప్పే మాటల్లో ఏమాత్రం విశ్వసనీయత ఉండడంలేదు.

కొన్నేళ్లక్రితం టివిసంస్థ బట్టతలపై కొత్తవెంట్రుకలు వస్తాయంటూ ,న్యూజెన్ గోల్డ్ అనే తలనూనెను మార్కెట్ లో ప్రవేశపెట్టింది. ఆ ఉత్పత్తి ప్రచారంలో భాగంగా ఈనాడువంటి పెద్ద దినపత్రికలలో పూర్తి నిడివి ప్రకటనలు గుప్పించింది. నూనె కొన్నవారు నూనె రాసుకున్నవెంటనే తమ అరచేతులను శుభ్రంగా సబ్బుతో కడుక్కోకపోతే అరచేతిలో వెంట్రుకలు వచ్చే ప్రమాదముందనే హెచ్చరికను కూడా జారీ చేసింది. ఈ హెచ్చరికను చూసి నవ్వుకునేవారికంటే, నమ్మేవారి సంఖ్యే అత్యధికంగా ఉండడంవలన

అనతికాలంలోనే కోటానుకోట్లు వెనుకేసుకున్న ఆ సంస్థ కొంతకాలానికి ఆ హెచ్చరికను ప్రకటించడం ఆపివేసింది. మెరుగైన సమాజంకోసం, అవినీతి అంతంకోసం అంటూ బీరాలుపోయే ఇతర ప్రసారమాధ్యమాలు సైతం 'చెప్పేదొకటి- చేసేదొకటి' అన్నవిధంగా ప్రసారాల్ని అందించడం జరుగుతోంది. ఇక ధన సంపాదనకోసం మాయా ఉంగరాలు, వశీకరణ ఆంత్రాలు, ధనలక్ష్మి యంత్రాలు, తాయెత్తులు, తాగుడు మాన్పించే మందులు, చక్కెరవ్యాధి శాస్విత నివారణ ఔషధాలంటూ అనేకరకాల మోసపు మాయాజాలాల్ని జనాలమీదకు రుద్దడం చేస్తున్నారు. పైగా ఈ ప్రకటనలోని అంశాలకు లేదా దానివల్ల వచ్చే నష్టాలకూ తమకు ఎటువంటి బాధ్యత లేదంటూ లేదని ముందుగా ప్రకటించి చేతులు దులుపుకొంటున్నారు. వాస్తవానికి ఇప్పుడు అమలులో ఉన్న 'ప్రివెన్షన్ ఆఫ్ మాజిక్ రెమిడీస్' చట్ట ప్రకారం ఇవి నేరం అయినా రాజ్య యంత్రాంగం, రాజకీయ బాధ్యతా రాహిత్యాలవల్ల ఇవి నిరాటంకంగా ప్రసారమౌతూనే ఉన్నాయి.

ఇక ఒక వార్తను అందించే విధానంలోని పక్షపాత ధోరణిని ఛూద్దామ్. విద్యుత్ సంక్షోభం నెలకొన్న కాలంలో, ఈ ఆంశంపై ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో జరిగిన నిరసన ఉద్యమంలోహైదారాబాద్ 'బషీర్ బాగ్' లో పోలీసు కాల్పులలో కొందరు ఉద్యమకారులు మరణించారు. నాడు అధికారంలో ఉన్న తెలుగుదేశంపార్టీకి మద్దతు ఇచ్చే దినపత్రికలో, ఆవార్తను చాలా మామూలు అంశంగా వార్త రాస్తూ, పక్కనే పెద్ద అక్షరాల శీర్షికతో, 'అమెరికాలోనూ తప్పని కరెంటు కష్టాలు' అనే పేరుతో, అగ్రరాజ్యమైన అమెరికాలో సైతం విద్యుత్ సంక్షోభం ఉన్నట్లు చిత్రించి, సమస్య తీవ్రతను తేలికపరిచే దళారీ తనం కనబడుతోంది. మామూలు పాఠకులు ఎవరైనా విద్యుత్తు సంక్షోభం పాలకుల

వైఫల్యం కాదని, అదేదో మామూలు సాధారణ అంశమనే భావనను కలిగించడంద్వారా అధికార పార్టీకి కొమ్ముకాసే విధంగా వార్తను మలచడం జరుగుతుందనడానికి ఇదో ఉదాహరణమాత్రమే.

అయితే, నేడు ప్రజానీకం ముందుకు వచ్చిన అంతర్జాల ఆధారిత ప్రత్యామ్నాయ మాధ్యమాలు అనేక అంశాలలో ప్రజలను విస్తృతంగా ప్రజలముందు పెడుతున్నాయి. ఎక్కడ ఏ అఘాయిత్యం జరిగినా, బహిరంగంగా పోలీసు, రెవెన్యూ వంటి రాజ్య యంత్రాంగం మానవ హక్కుల ఉల్లంఘనలకు పాల్పడినా వీలున్నచోట్లల్లా వాటినిస్మార్ట్ ఫోన్ లలో వీడియోల్లో తిరుగులేని సాక్ష్యంగా అందించడంద్వారా న్యాయం అండేందుకు దోహదపడడం మనం చూస్తున్నాం. చట్ట సమానత్వంపై ఏమాత్రం అవగాహన లేకుండా, అధికారం, సామాజిక స్థాయి, ధనబలం, కులబలం ప్రాతిపదికన వ్యవహరించే రాజ్య యంత్రాంగానికి ఇటువంటివి కొంతమేరకైనా కనువిప్పు కలిగించే అంశాలుగా గుర్తించవచ్చు. ప్రత్యామ్నాయ మాధ్యమాలను గురించి తలచుకునేటప్పుడు ప్రత్యేకంగా నాలుగు దశాబ్దాల క్రితం 'ఎన్ కౌంటర్' అనే పక్షపత్రికను నడిపిన 'పింగళిదశరధరాం' గురించి ప్రత్యేకంగా పేర్కొనకుండా ఉండలేము.

కేవలం ఏడవ తరగతి మాత్రమే చదువుకున్న అతను తీవ్రమైన పేదరికం నుంచీ కష్టాలనుంచీ పెరిగి, అతికష్టంమీద ఎంకౌంటర్ పత్రికను ముద్రించాడు. వంద ప్రతులు ముద్రించి, బెజవాడ బస్టాండ్ లో స్వయంగాఅమ్ముకునే దశనుంచీ దాదాపు లక్ష ప్రతులు ముద్రించే దశకు కొద్దినెలల కాలంలోనే చేరుకున్నాడు. అప్పటి వరకూ ఉన్నదున్నట్లు పాస్సివ్ గా నివేదించే పత్రికల ధోరణికి భిన్నంగా ఒక కొత్త ఒరవడి సృష్టించాడు. మంగమ్మవ్వ వంటి స్వామినులు, బాబాల బండారాలు బయటపెట్టేడు. ఆనాడు రాష్ట్ర ఆర్థిక మంత్రిగా

ఉన్న రోశయ్య, తెనాలిలో కొత్తగా కట్టించిన ఒక సినిమాహాలుప్రారంభానికి ముందు ఒక నిరుపేద బాలుడిని బలి ఇచ్చినట్లు ఏపత్రికలోనూవార్త రాలేదు. ఆవిషయం తెలుసుకున్న దశరధరామ్ స్వయంగా అక్కడకువెళ్లి కొన్ని ఫోటోలు తీసుకొని ప్రచురించడంతో ఆ వార్త దావానలంలా వ్యాపించింది. అన్నీ పత్రికలూ ఈ అంశాన్ని ఆలస్యంగా అయినా ప్రచురించక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇతను వ్యక్తుల ఆంతరంగిక విషయాలను, రహస్యంగా సాగించే రంకు బాగోతాలనూ పత్రికలకు ఎక్కించేవాడు. మంత్రులు, ఇతర ప్రముఖుల వ్యక్తిగత జీవితాల్లోని లొసుగులు బయట పెట్టి వాళ్ళను నీచంగా చిత్రీకరించడం జరిగేది. దీన్ని తప్పుపట్టినవారికి సమాధానంగా, "వ్యక్తుల వ్యక్తిగత జీవితాలు వారి ఇష్టం. పబ్లిక్ లోకి వస్తే ఏమైనా అంటాం" అనే శ్రీ శ్రీ మాటల్ని ఉటంకించేవాడు. విషయపరంగానే కాకుండా భాషాపరంగా కూడా ఒక కొత్త ఒరవడి దిద్దిన దశరధరామ్ ను 1985 అక్టోబర్ 21వ తేదీన రిక్షాలో వస్తుండగా విజయవాడ సత్యనారాయణపురం పోలీసు స్టేషన్ ఎదురుగా కిరాయి గూండాలు కత్తులతో పొడిచి చంపేరు. దాంతో ఒక శకం ముగిసినట్లు కనబడినా తెలుగునాట ప్రత్యామ్నాయ పాత్రికేయానికి ఒక కొత్త ఒరవడి అందించాడు. అనంతర కాలంలో ఆ ఒరవడిని చాలావరకూ ఉదయం దినపత్రిక అనుసరించినట్లు చెప్పుకొంటారు.

ఇక ప్రత్యామ్నాయ ప్రచార మాధ్యమాలలో అనేక గ్రూపులు వాస్తవాలను ధైర్యంగా చర్చించడం జరుగుతోంది. ఇవి ప్రజలపై తీవ్ర ప్రభావాన్ని చూపి ఉద్యమాలకు సైతం బాటలు వేసిన సంఘటనలు కొల్లలుగా కనబడుతున్నాయి. ఈ అంతర్జాలా ఆధారిత ప్రత్యామ్నాయ మార్గం వచ్చిన కొత్తలో దేశ రాజధాని డిల్లీలో జరిగిన నిర్భయ ఉదంతాన్ని ఇందుకు

ఉదాహరణగా చెప్పుకోవచ్చు. మహిళల ఉద్యోగత ఎక్కువగా ఉండే ఢిల్లీ వంటి నగరాలలో మహిళలు అందరూ వ్యక్తిగతంగా అనుభవించే వివిధరకాల వేధింపుల పరాకాష్టగా ఉన్న ఈ హత్య సంఘటన అసంఘటితంగా ఉన్న అక్కడి వేలాది మహిళలను సంఘటితం చేసి పెద్దసంఖ్యలో ఉద్యమించడానికి సామాజిక మాధ్యమాలు ప్రధానసమాచార వాహికగా పని చేశాయి.

ప్రత్యామ్నాయ సామాజిక మాధ్యమాలలో చిన్న పత్రికల పాత్ర గణనీయంగా ఉంది. ముఖ్యంగా  అనేక స్థానిక సమస్యలను, వివక్షలనూ ప్రశ్నించడంలో ఇవి ముఖ్య పాత్ర పోషిస్తున్నాయి. కొన్ని అంతర్జాల సామాజిక వేదికలు, తెలిగ్రామ్, వాట్సప్ గ్రూపులు, ఫేస్ బుక్ గ్రూపులు, భావసారూప్యత ఉన్న ఎక్కడెక్కడివారినో ఒకచోటకు చేర్చి, వారందరిమధ్యనా పరస్పర అవగాహన పెంచడానికీ, ప్రజాపక్షంగా ఉండే ఉద్యమ కార్యాచరణకూదోహదంచేస్తున్నాయి.

ప్రత్యామ్నాయ సామాజిక మాధ్యమాలలో అనేక అనైతిక అంశాలు, పక్షపాత ధోరణితో ఉండే రాజకీయ ప్రచారాలు, అసభ్యకర లైంగికపరమైన అంశాలతో సహా మెదళ్ళను కలుషితం చేసే అనేక అవాంఛిత దుష్ప్రచారాలు సైతం చాలా ఎక్కువ శాతం ప్రత్యక్షమౌతున్నాయి. ప్రతీ అధికార రాజకీయ పక్షమూ తనకంటూ ప్రత్యేకంగా ఒక అంతర్జాల వేదికను, సామాజిక మాధ్యమాన్ని సృష్టించి నడపుతూ ఉండడం మనం చూస్తున్నాం. ఇటువంటి పరిస్థితుల్లో వాటిలో వచ్చే ప్రతీ అంశాన్ని అర్థం చేసుకోవడానికి ప్రజల్లో ఎంతో వివేచన, తార్కిక జ్ఞానం అవసరమౌతుంది. ఐతే, అసలు ఏమాత్రం ప్రత్యామ్నాయ విషయాలు, ప్రజల గొంతుకా వినిపించడానికి అవకాశాలే లేని పరిస్థితులనుంచీ, ప్రతి ఒక్కరూ బహిరంగంగా తమ గొంతు వినిపించడానికి దోహదం చేస్తున్న ప్రత్యామ్నాయ ప్రసార మార్గాలుగొప్ప గెంతుగా ముందుకు దూకటంగా అభివర్ణించవచ్చు.  కాబట్టి ఇటువంటి ప్రచురణలద్వారా సామాజిక మాధ్యమాల్ని అర్థం చేసుకోవడానికి అవసరమైన వివేచనను ప్రజలకు అందించడానికి ప్రజాస్వామ్యవాదులంతా కృషి చేయాల్సిన అవసరముంది.

**--- అనిసెట్టి శాయికుమార్**

## 08. ప్రత్యామ్నాయ జర్నలిజం - సాకారం కాలేని స్వప్నం

**– నల్లి ధర్మారావు, జర్నలిస్టు, శ్రీకాకుళం.**

ఇండియన్ మీడియాకు స్వీయ నియంత్రణ అవసరమని భారత ప్రధాన న్యాయమూర్తి ఎన్వీ రమణ జూలై 23న జార్ఖండ్ లోని రాంచీలో హితవు చెప్పారు. ఈ హితవు చెప్పిన తొలి మేధావి ఆయన కారు. చాలా మంది చాలా ఏళ్ళ నుంచి చెబుతున్నదే. ప్రత్యక్షంగా ఎలక్ట్రానిక్ సోషల్ మీడియా తీరు తెన్నుల పట్ల జస్టిస్ రమణ స్పష్టమైన అసహనాన్ని వ్యక్తం చేశారు. వాటికి జవాబుదారీ తనం లేదని ఆవేదన వ్యక్తం చేశారు. పత్రికారంగం కొంత ఫర్వాలేదని కితాబిచ్చారు. జస్టిస్ రమణ మాటలకు స్పందించి అదే కార్యక్రమంలో ఉన్న కేంద్ర సమాచార, ప్రసారశాఖామంత్రి అనురాగ్ థాకూర్ స్పందించి, మీడియా సంస్థలు ఆత్మ పరిశీలన చేసుకోవాలని, పిలుపునిచ్చారు. ఇద్దరు పెద్దలు మంచి మాటలే చెప్పారు. స్వీయ నియంత్రణ, ఆత్మ పరిశీలన, ఒక్క మీడియాకేనా? ఇతర వ్యవస్థలకూ అవసరం లేదా? అనే ప్రశ్న, ఇదే సమయంలో కొందరిలోనైనా తలెత్తుతుంది. న్యాయ వ్యవస్థకు, ప్రతినిధిగా జస్టిస్ రమణ, మోదీ ప్రభుత్వం లేదా బీజేపీ నాయకత్వ ప్రభుత్వ ప్రతినిధిగా ఠాకూర్ మాట్లాడారు. మన దేశ అత్యున్నత న్యాయ వ్యవస్థలో అత్యున్నత న్యాయ స్థానంలో ఉన్న లొసుగులను బయట పెట్టడానికి జస్టిస్ చలమేశ్వర్ బృందం మీడియానే ఆశ్రయించిన పరిణామం చాలా మందికి గుర్తుండే ఉంటుంది. జాతీయ మీడియాను బీజేపీ ఎలా మేనేజ్ చేసిందీ, చేస్తున్నదీ ఎక్కువ మందికి తెలుసు. అనురాగ్ ఠాకూర్ ఎందుకు అన్నారో ఆత్మ పరిశీలన చేసుకోవాలని.. నిజంగానే ఆత్మ పరిశీలన చేసుకోవాల్సిందే!!

అయితే, స్వీయ నియంత్రణ ఎలా జరుగుతుంది? ఆత్మ పిరశీలన ఎవరు చేసుకోవాలి? మీడియా యాజమాన్యాలా? జర్నలిస్టులో?- అంటే ఖచ్చితంగా యాజమాన్యాలే అనే జవాబు వస్తుంది. 1947 ఆగస్టు 15న దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన, మరుసటి నెలలోనే (సెప్టెంబర్ 21) గాంధీ మహాత్ముడే పత్రికల తీరు పట్ల అసహనం వ్యక్తం చేశాడు. పత్రికులు స్వేచ్ఛ కలిగి ఉండటం అంటే, ప్రజల మనస్సును విష కలుషితం చేసే లైసెన్స్ లైసెన్స్ ఉన్నదనా? అని ప్రశ్నించారు ఒక సందర్భంలో అప్పటికి ఎలక్ట్రానిక్ మీడియా పాత్ర నామ మాత్రం. సోషల్ మీడియాలేదు, కానీ గాడి తప్పిన పత్రికలు ఉన్నాయని అర్థమవుతుంది. స్వాతంత్ర్యం ఉద్యమ కాలంలో గాంధీ, నెహ్రూ, ఇతర అగ్రనేతలు స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా పత్రికలు నడిపినవారే? వారి ఆశయం స్వాతంత్ర్యం సముపార్జన, స్వాతంతత్ర్యం వచ్చిన తర్వాత పత్రికలకు ఆశయం, లక్ష్యం లేవు. సమరయోధులు, త్యాగధనులు వెనక్కిపోయారు. వ్యాపారులు, పారిశ్రామికవేత్తలు, ప్రత్యక్ష పరోక్ష పాత్రధారులైన రాజకీయ నాయకులు వచ్చారు. కొందరు రాజ్యసభ సభ్యులుగా పత్రికలను అడ్డం పెట్టుకొని వెళ్ళారు.

యాజమాన్యాల స్వార్థం ఏదైనా, సకాలంలో వార్తలు చేరవేసే పత్రికలకు పాఠకుల ఆదరణ పెరిగింది. ఆదికవి నన్నయ తన మహాభారతం, సభాపర్వంలోనే చెప్పాడు, వార్తయందు జగము వర్తిల్లుచున్నది అని – తెలుగు పత్రికారంగ చరిత్రను ఈనాడు మలుపు తిప్పింది. పక్షపాత జర్నలిజానికి కూడా ఈ పత్రికే బీజాలు నాటింది. దేశమంతా ఈ అక్షర కాలుష్యం అలుముకుంది. ది హిందూ వంటిది అతీతంగా నిలబడింది. దీనికి కారణం ఆ పత్రిక యాజమాన్య వారసుడు ఎన్.రామ్. అతడు వామపక్షవాది కావడం వల్ల, బోఫోర్స్ కుంభకోణం

వెలికితీసినప్పుడు, ప్రచురించడానికి నిరాకరించినప్పుడు, కుటుంబాన్ని విడిచి వచ్చారు.

1975 ఎమర్జన్సీ, 1987 జనతాపార్టీ ఆవిర్భావం-ఇంతవరకూ జాతీయ మీడియా స్వతంత్రంగానే వ్యవహరించింది. 1983 నుంచి ఆంధ్రప్రదేశ్లో 1994 నుంచి జాతీయ స్థాయిలో పెనుమార్పులు వచ్చాయి. మీడియా మేనేజ్మెంట్ ప్రధాన రాజకీయ పార్టీల వ్యూహంలో భాగమయ్యింది. ఎన్నికల రోజుల్లో పెయిడ్ న్యూస్ (చెల్లింపు వార్తలు) అనే ధోరణి వచ్చింది. సర్వేల పేరుతో ఓటర్లను ప్రభావితం చేసే ఎత్తుగడలు ప్రారంభయ్యాయి. చివరికి, పాఠకులు ప్రజలే అప్రమత్తమై ఏది నిజం? ఏది అబద్ధం? అని తెలుసుకోవడానికి రెండు పత్రికలు చదివే స్థితి, రెండు ఛానెళ్ళు చూసే స్థితి వచ్చింది. క్రమంగా ఏ పత్రిక, ఛానెల్ ఏపార్టీ బాకా! అనేది అర్థమైపోయింది. పెట్టుబడిదారీ (వ్యాపార)యాజమాన్యాలు నిజంగా సిగ్గుపడాలి. వారికి ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు ముఖ్యం కనుక, అవి సిగ్గుపడే ప్రసక్తిలేదు. ఈ నేపథ్యంలోనే. ప్రత్యామ్నాయ జర్నలిజం అనే చర్చ ప్రారంభమయ్యింది. ఈ కోణంలో వామపక్ష పార్టీల పత్రికలు ఆశా దీపాల్లా కన్పిస్తున్నాయి. కానీ, ఆ పార్టీలు ఎన్నికల ఎత్తుగడల పేరుతో బూర్జువా పార్టీలతో పొత్తులు పెట్టుకున్నప్పుడు, ఆ ముద్ర అవి నిర్వహించే మీడియాపై కన్పిస్తుందనే అనుమానం వచ్చినప్పుడు, వాటిని విశ్వసించినవాళ్ళు నిరాశకు గురవుతున్నారు. ఒక మీడియా సంస్థ స్థాపించి, దాన్ని పారదర్శకంగా పాఠకులకు జవాబుదారీతనంతో నడవడానికి గొప్ప ఆశయం ఉంటే సరిపోదు.పెట్టుబడి ఉండాలి. అందుల్ల ప్రత్యామ్నాయ జర్నలిజం అనేది సాకారంకాని స్వప్నం. బియ్యంలో రాళ్ళు ఏరుకొని, వండుకున్నట్టు, వార్తలు కథనాల్లో నిజానిజాలను పాఠకులు, ప్రేక్షకులు సొంత విచక్షణతో ఎంచుకోవలసిందే. నిజంగా ఇది మన దౌర్భాగ్యం.

**– నల్లి ధర్మారావు, జర్నలిస్టు, శ్రీకాకుళం.**

# 09. వార్త ప్రజల సమస్యలను ప్రతిబింబించాలి

--- పి.ఎస్.రవికాంత్, అడుగుజాడ పత్రిక, రాజమహేంద్రవరం.

అక్షరం కొందరికి ఉపయోగకరం మరికొందరికి అక్షరం ప్రయోజనకరం. అక్షరం అయితే అందరికీ ప్రమోదకరం. కావాలనే ఒక లక్ష్యశుద్ధితో పాత్రికేయ వృత్తిలోకి ప్రస్థానమైంది. అక్షరాల్ని చుట్టుకొన్న సమాజం నుంచి అక్షరాలు వెలిగించే సమాజం కోసం కష్టించి శ్రమించి ఉద్యమించిన పాత్రికేయ వృత్తిని నిబద్ధతతో వారి స్ఫూర్తితో పాత్రికేయ రంగంలోకి రావడ, యాదృచ్ఛికం కాదు. కానీ అనివార్యంగా అవసరం అయిన నేపథ్యం...

విద్యార్థి ఉద్యమం నుంచి రైతుకూలీ ఉద్యమంలోకి వెళ్ళి భూమికోసం భుక్తికోసం బానిస జన విముక్తి కోసం సాగించిన పోరులో నా వంతు బాధ్యతగా పనిచేసిన క్రమంలో భూస్వాముల పన్నాగాలు కుతంత్రాలు పోలీసుల నిర్బంధాలు అధిగమించి నిలబడిన వ్యక్తిత్వం.

వందలాది ఎకరాల మిగులు భూమికోసం రైతుకూలీలతో కలిసి ఆక్రమించి అధికారులు రాజకీయ నాయకులు కలిసి మిగులు భూముల ఉనికిని ప్రశ్నార్ధకం చేసిన క్రమంలో వాటిని వెలికితీసి.... ఇదీ సీలింగ్ భూమి వీటికి పట్టాలివ్వండి, పేదలకు పంచండి అనే డిమాండ్తో మిగులు భూమి భూముల్లో జెండాలు పాతితే భూఆక్రమణ కేసులు బనాయించారు. పోలీసులు దేవాదాయ ధర్మాదాయ భూములు నామమాత్రపు శిస్తులతో భూములున్నవారే అనుభవిస్తుంటే వాటిని బయటకు తీసి పేదలకే ఇవ్వాలని వేలం ద్వారా శిస్తు రేటు పంచిన ఉద్యమంలో కూడా పెత్తందారులతో పోలీసులు కుమ్మక్కై అక్రమ కేసులు పెట్టారు.

ఉద్యమం నిర్బంధం తర్వాత ప్రజా క్షేత్రంలో పీడితుల పక్షాన ప్రజాగొంతు అవసరమని పాత్రికేయంగంలోకి అడుగిడటం జరిగింది. ఉద్యమాల వెల్లువ తర్వాత వార్త దిన పత్రిక ఆవిర్భవించింది. అందులోకి వచ్చి చేరింది ప్రజల గొంతును తమ కలం ద్వారా వినిపించేతరం.

ప్రజల చేతిలో పాశుపతాస్త్రం కాస్తా యాజమాన్య వశం షరా మామూలుగా మారింది లైన్ అక్కౌంట్ ను కాదని , వార్తలు రాసేవారు స్టింగర్స్ కాదు. విలేకరులనే గౌరవప్రదమైన పిలుపు, పనికి వేతనంలాంటి ఆకర్షణీయతలకు తిలోదకాలిచ్చి రాసిన వార్తలతో దండుకోండి లేదంటే యాడ్స్ తెచ్చుకుని జీతాలు లేసుకోండి ఇదే నాటి యాజమాన్య వైఖరి

**--- పి.ఎస్.రవికాంత్, అడుగుజాడ పత్రిక,** రాజమహేంద్రవరం.

## 10. ప్రత్యామ్నాయ జర్నలిజం అంటే ఏమిటి ?

### --- స్టాలిన్, ఫ్రెండ్స్ న్యూస్ ఏజెన్సీ, పిఠాపురం

ప్రస్తుత సమాజంలో జర్నలిజానికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. సమాజంలో జరుగుతున్న విషయాలపై సందేశాలు ఇవ్వాలన్న దానిలో ఉన్న లోపాన్ని ఎత్తిచూపాలన్న ఒక వ్యవస్థ అన్నది ఎప్పుడు అవసరం ఉంటుంది. ఆ వ్యవస్థ నిర్వహించే ప్రక్రియలోని సత్యం దాగి ఉందా లేదా అన్న విషయాన్ని స్పష్టంగా అందించగల భూతద్దమే జర్నలిజం అని చెప్పుకోవచ్చు.

కానీ నేటి సమాజంలో వాస్తవాల్ని అన్వేషించడం అందించడం అంటే మన చేతుల్ని నేరుగా తీసుకెళ్లి కాగుతున్న నూనెలో ఉంచినట్లే అని చెప్పవచ్చు. నేడు సత్యం కోసం వెతకడం కాదు దానికోసం ఎంత ప్రయత్నించినా దొరకడం లేదు. ఇవన్నీ సర్వసాధారణం అనే సమాజం ముసకేసి నిద్రపోవడం దౌర్భాగ్యమైన స్థితి, అధికారం, రాజకీయం అనే రెండు చక్రాలుఈ వ్యవస్థ మొత్తాన్ని నడిపిస్తున్నాయి. అని చెప్పవచ్చు. అధికారమనే వ్యవస్థ అసత్యానికి మంచంలా పనిచేస్తుంటే రాజకీయమనే వ్యవస్థ దానికి దుప్పట్లాగా పనిచేస్తుందని చెప్పొచ్చు. వీటి వీటి మధ్య సమాజం తన వాస్తవ స్థితిని కోల్పోయి నిర్జీవమైన స్థితిలో ఉన్నాము అనే భావనలో వెళ్ళిపోయింది ఇది ఎవరు నమ్మకపోయినా వాస్తవం.జరిగింది ఏంటి అన్న విషయం వ్యక్తి యొక్క అంతరాత్మ వాస్తవాన్ని చెబుతూనే ఉంటుంది.

జర్నలిజం ద్వారా ప్రజలకు అందించే సమాచారం నేడు వాస్తవాలను కంటికి కనిపిస్తున్నట్లు చూపిస్తుందా అనే సందేహం ఆ సమాచారాన్ని అందిస్తున్న వారికి సైతం సంస్థలకు సైతం అనుమానం ఉందంటే మీరే అర్థం

చేసుకోవచ్చు? ఇక్కడ జర్నలిజాన్ని అవమానించాలనో లేకపోతే వేలెత్తి చూపాలన ఉద్దేశం అయితే ఏమీ లేదు. జర్నలిజం ఎక్కడో తన వాస్తవ స్వరూపాన్ని తన శక్తిని కూలిపోయిందనే చెప్పవచ్చు.అది. భయం అనే స్థితిలోక లేకపోతే మనకే ఎందుకు అనే పరిస్థితుల్లో సంస్థలను కొనసాగించాలి అనే భ్రమలో కొట్టుమిట్టాడుతుంది. ఒక వ్యక్తి జర్నలిజం ద్వారా వాస్తవాన్ని అందించాలని అనుకున్న తన జీవితం మొత్తం కేసులు మధ్య లేక తానే కనుమరుగవుతున్నాడేమో అన్న విషయంలో, ప్రస్తుత సమాజం ఉంది.

కొందరు తమ శక్తి సామర్థ్యాలతో జర్నలిజాన్ని ఒక నల్లటి ముసుగ్గా మార్చేసారంటే వాస్తవం దేశస్థాయిలోనే కొందరు తమ శక్తితో మరొక కోణంలో చూపడం మొదలుపెట్టారు దాన్ని జర్నలిజం అనే బదులు ప్రచార డబ్బాలు అనడం మంచిది. ప్రజలకు వాస్తవాన్ని అందించినప్పుడు మాత్రమే దాని యొక్క పూర్వం మరియు భవిష్యత్తు మీద ఒక ఆలోచనకురాగలడు. అవాస్తవాన్ని వాస్తవంగా చెప్పినప్పుడు మనిషి యొక్క ఆలోచన శక్తి నశించి ఒక మర బొమ్మగా తయారవుతాడు అన్నది వాస్తవం. సమాజం ప్రస్తుతం అదే స్థితిలో ఉందంటే ఇది అందరికీ తెలిసిన నిజం కానీ ఎవరు ఒప్పుకోరు ఎందుకంటే ప్రస్తుతం మన దేశంలో జరుగుతున్న ఎన్నికల్లో దానికి

నిదర్శనంగా నిలుస్తాయి ఎన్నికలలో జరిగే అవినీతి గురించి. అందరికీ తెలుసు కానీ ఇచ్చేవారు తీసుకునేవారు. నిర్వహించేవారు ప్రతి ఒక్కరు కూడా ఏమీ జరగనట్టు వ్యవస్థ మొత్తం కూడా సమర్ధవంతంగా నీతివంతంగా నడుస్తున్నట్టు వ్యవహరిస్తుంటారు. ఇదే ఎవరికి వారిని మోసం చేసుకోవడం నిదర్శనం ఇలాంటి సమయంలో వాస్తవమైన జర్నలిజం ఉన్నది బయటపడటం అంటే ఎడారిలో నీళ్ల కోసం వెతుకులాట వంటిది.

ఇలాంటి సందర్భంలోనే వ్యక్తులే తామే స్వయంగా తపు బాధ్యతగా ప్రత్యామ్నాయ జర్నలిజం ద్వారా కొన్ని వాస్తవాలన్నది ప్రజలకి అందించడం వల్ల కనీసం ఎంతో కొంత మేలు జరుగుతున్నదన్నది వాస్తవం సోషల్ మీడియా ద్వారా వ్యవస్థలో అధికారుల్ని రాజకీయ నాయకులు భయపడి వాస్తవాలు ప్రత్యన్నమయ వ్యవస్థ ద్వారా బయటికి రాములతో చచ్చినట్లు ప్రజలకు వాస్తవాలను తెలుపవలసిన పరిస్థితులు అయితే వస్తున్నాయి దీని ద్వారా అయినా వందకు వంద శాతం న్యాయం జరగకపోయినా వాస్తవాలైతే బయటకు రావడం జరుగుతుంది. ఈ మధ్యకాలంలో ఎన్నో సంఘటనలు. నమ్మిన ఇటువంటి చూడవచ్చు కానీ వీటిని కూడా తప్పుడుగా చూపించే స్థాయికి ప్రస్తుత వ్యవస్థ అయితే ఉంది ఎందుకంటే. వాటిని కూడా నిర్ధారించవలసింది వ్యక్తులకే ఈ దౌర్భాగ్య పరిస్థితి అయితే ఏర్పడింది.

ప్రత్యున్నమయ జర్నలిజం ద్వారా ఎంతోమంది ముసుగును తొలగించి వారి వాస్తవ రూపాన్ని ఒకొక్కసారిబట్టబయలు చేస్తుంది. వారు తెర చేస్తున్న విషయాలను వెనక సమాజంలోనికి తీసుకొచ్చి వారి ఏంటి అన్న విషయాన్ని అందరికీ తెలియజేస్తూ ఉన్నాయి. వీటిలోని ఎక్కువగా బాధితులు గాని లేకపోతే ప్రజలు గాని ప్రధానమైన పాత్రను పోషిస్తూ ఉంటారు. వీటి గురించి ఉదాహరించాలంటే ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి కానీ ఇప్పటికే మేము అందించిన సమాచారాన్ని మీ స్పర్శకు ఎన్నో సంఘటనలు గుర్తుకు వస్తుంటాయి ఎందుకంటే ప్రతిరోజు నిత్యం మనము సోషల్ మీడియా ద్వారా ఈ పరిస్థితుల్ని చూడగలుగుతున్నాం.. అత్యుత్తమ పదవుల్ని అనుభవించి గొప్ప స్థితిలో ఉన్న వారిని కూడా వారి యొక్క రంగులను స్పష్టంగా ప్రజలకు

అందించిన ప్రత్యామ్నాయ జర్నలిజం అని అనవచ్చు చెప్పొచ్చు. ప్రధానంగా ఇప్పుడు వాడుతున్న సెల్ ఫోన్లు ఒక ఆయుధం లాగా వీళ్ళతో ఉపయోగపడుతున్నాయి. లేకపోతే మరుగున పడకపోయినా ఎన్నో విషయాలు ప్రజలకు తెలిసే అవకాశం లేదు. నేడు జర్నలిజం వ్యవస్థను ప్రత్యన్నమైె జర్నలిజం నేరుగా ముక్కు సూటుగా ప్రశ్నిస్తుంది. కోర్టులు కూడా దీనికి అండగా నుంచున్నాయి ఒక వ్యక్తి తన యొక్క భావాలను వ్యక్తపరచుకోవడానికి లేకపోతే వాస్తవస్థితిని సోషల్ మీడియా ద్వారా తెలియజేయడానికి హక్కును కలిగి ఉన్నారన్న విషయం స్పష్టం చేయడం జరిగింది.

--- స్టాలిస్, ఫ్రెండ్స్ న్యూస్ ఏజెన్సీ, పిఠాపురం

# ఆదర్శ జర్నలిస్టు జీవితానికి అపూర్వ రూపం

## "బాంబు"




మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)

జననం: 1955, డిసెంబర్ 04

మరణం: 2022 ఫిబ్రవరి 28

బాంబు ఓ భాస్వరం.. ఒక ధిక్కార స్వరం.. ఓ మేలుకొలుపు.. ఒక ఆత్మీయ సాంత్వన చరుపు.. ఆయన జనం కోసమే జర్నలిజం అని నమ్మినవాడు, ప్రజల కోసమే పత్రికలనే పాత్రికేయుడు. ఎన్ని అడ్డంకులు ఎదురైనా, జీవితాంతం తాను నమ్మిన విలువలకు కట్టుబడిన ధీరోదాత్తుడు. ఎన్నో సంచలన పత్రికలకి అప్రకటిత వ్యవస్థాపకుడు. ఏకంగా ఎన్కౌంటర్ పత్రికపైనే కలాన్ని ఎక్కుపెట్టిన పోరాట యోధుడు. నిలదీతంటూ మొదలెడితే తన పర భేదాలు చూడకుండా నిగ్గదీసే నిఖార్సైన వ్యక్తి. అసమానతలతో

నిండిన లోకంలో అందర్నీ సరిసమానంగా ప్రేమించగలిగిన ధీశాలి. ఎక్కడా కనీసం సెంటు భూమి కూడా లేదని నిజాయితీగా గుండెల మీద చెయ్యేసి చెప్పగలిగిన అరుదైన అభ్యుదయ శక్తి, ఆయనే మన, మేకా సత్యనారాయణ శాస్త్రి @ బాంబు.

2022, ఫిబ్రవరి 28 సోమవారం తెల్లవారు జామున పిఠాపురంలో అకస్మాత్తుగా మరణించారు. హుందాతనానికి ప్రతిరూపంగా, సంతోషం సైతం అచ్చెరువొందేలా, నిష్కల్మషమైన వదనంతో ఎప్పుడూ నవ్వుతూ చివరి వరకూ తనకి ఉన్నదాంతో సంతృప్తిగా జీవించిన బాంబు నిజంగానే మన కాలపు మానవతకి మారు పేరు, మాయమైపోతున్న నిండుతనానికి ఎడతెగని హుషారు. అరమరికలు లేకుండా అందర్నీ ప్రేమించే అద్వితీయ సెలయేరు.

మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలుగా మారిపోతున్న ఈ రోజుల్లో మమతానురాగాల చిరునామా ఆయన ఆత్మీయ ప్రేమ. మనుషులంతా యాంత్రికంగా మారిపోతున్న రోజుల్లో విలువలతో కూడినది ఆయన విధానం. ఎప్పటికీ అది నిరుపమానం. అందుకే తన కళ్ళనీ, దేహాన్ని దానం చేసి ఇద్దరు అంధులకు చూపునూ, ఎందరో భావి వైద్యులకు విద్యని అందించి మరణానంతరం కూడా జీవించే ధైర్యం కలిగిన అరుదైన వ్యక్తాయన, తండ్రిగా నా అస్తిత్వానికి కారకుడైన అలాంటి వ్యక్తికి ఆత్మీయతతో... ఈ కృతినిలా...

**--- సెలవు...**